# సంఘ దర్శన్

# ముందుమాట

"సంఘదర్శన్" రాష్ట్రీయ స్వయంసేవక సంఘ తత్త్వదర్శమును కల్గించు ప్రయత్న మీ చిన్ని పుస్తకము. సంఘముయొక్క చారిత్ర కావసరము, సంఘ జననము, వ్యాప్తి, అభివృద్ధి, తత్త్వసిద్ధాంతములు, కార్యపద్ధతి మున్నగు విషయములను క్లుప్తములో పరిచయముచేయుట దీని లక్ష్యము.

సంఘము నేడు నగరములందంతటనే గాక గ్రామములకుకూడా విస్తరిల్లియున్నది. జాతీయ దృక్పథమున కిది గీటురాయిగను, జాతీయసమస్యల కిది పరిష్కారమార్గముగను, జాతీయసంఘటన కిది దివ్యసాధనముగను నేడు అధికాధికముగ ప్రజలు గ్రహించుచున్నారు. దీనినిగురించి మరింత తెలిసికొనవలెననే ఆసక్తికూడా ఎక్కువైనది ఆ ఆసక్తిని రవంత తీర్చుటకై జరిగిన ప్రయత్న మిది. ఇక సంఘ సమగ్రదర్శన మెలాగూ సంఘ కార్య తపోనిష్ఠద్వారా లభించవలసినదే!

ఈ చిన్నిరచన విజ్ఞానవంతులైన ప్రజానీకంలో ఆలోచనలు రేకెత్తించగలదని రాష్ట్రాభ్యున్నతికై, సంఘ కార్యోన్ముఖులగుటలో స్వల్పముగానైనా ఉపకరించగలదని ఆశిస్తున్నాం.

★

# ప్రార్థన

నమస్తే సదా వత్సలే మాతృభూమే
త్వయా హిన్దుభూమే సుఖం వర్ధితోఽహమ్ ।
మహామఙ్గలే పుణ్యభూమే త్వదర్థే
పతత్వేష కాయో నమస్తే నమస్తే ॥

ప్రభో శక్తిమన్ హిన్దురాష్ట్రాఙ్గభూతా
ఇమే సాదరం త్వాం నమామో వయం
త్వదీయాయ కార్యాయ బద్ధా కటీయం
శుభా మాశిషం దేహి తత్పూర్తయే ।
అజయ్యాంచ విశ్వస్య దేహీశ శక్తిం
సుశీలం జగద్యేన నమ్రం భవేత్
శ్రుతం చైవ యత్ కణ్టకాకీర్ణమార్గం
స్వయం స్వీకృతం న స్సుగం కారయేత్ ॥

సముత్కర్ష నిఃశ్రేయ సస్యైక ముగ్రం
పరం సాధనం నామ వీరవ్రతం
తదన్తః స్ఫుర త్వక్షయా ధ్యేయనిష్ఠా
హృదన్తః ప్రజాగర్తు తీవ్రాఽనిశమ్ ।
విజేత్రీ చ న స్సంహతా కార్యశక్తిర్
విధాయాస్య ధర్మస్య సంరక్షణం
పరం వైభవం నేతు మేతత్ స్వరాష్ట్రం
సమర్థా భవత్వా శిషా తే భృశమ్ ॥

॥ భారతమాతా కీ జయ్ ॥

# సంఘదర్శన్

అది ఒక విశాలమైదానం. మధ్యన కాషాయిధ్వజం రెపరెపలాడు తోంది. యువకులు, బాలురు, వివిధమగు దేశీయక్రీడలలో నిమగ్నులై వున్నారు. ఉత్సాహంతో, కేరింతలుకొడుతూ, ఆనందంతో జయధ్వానాలు చేస్తున్నారు. కబాడీ ఆటలో కొందరు మైమరచి పాల్గొంటున్నారు. సాహసోపేతులైన యువకులు కబాడీ కూతతో ఎదుటి వారి మీదకు లంఘిస్తున్నారు. ఆట చూస్తేనే హృదయం ఉప్పొంగేటట్లున్నది. ఇరుపక్షాలవారూ విజయంకోసం దీక్షగా పోటీపడుతున్నారు. ఇంతలో ఆటనాడించేవ్యక్తి ఈలవేయగా, అంతహడావిడిలోనూ ఎక్కడివారక్కడ నిలబడిపోయారు. ఒక్కక్షణంలో అక్కడ నిశ్శబ్దత, పరిపూర్ణ క్రమశిక్షణ తాండవించాయి. తరువాత వ్యాయామకార్యక్రమం తీసుకోబడింది. దండవ్యాయామం, సూర్యనమస్కారాలు, పధసంచలనం ఇత్యాదులు నిర్వహించబడ్డాయి. ప్రతి కార్యక్రమంలోనూ సామూహిక కృషి, స్వయంప్రేరణతోగూడిన క్రమశిక్షణ కనిపిస్తున్నాయి. ఆతర్వాత అందరూ కలసి కూర్చొని దేశభక్తి ప్రపూర్ణమైన పాటను సామూహికంగా పాడుతున్నారు. జాతీయజీవనానికి సంబంధించిన సమస్యలను తీసుకొని కూలంకషంగా చర్చిస్తున్నారు. తుదకు అందరూ వరుసల్లో నిలబడి "నమస్తే సదావత్సలే మాతృభూమే" అని ప్రార్థనచేస్తున్నారు. ఆ ప్రార్థన నలుదిక్కులా ప్రతిధ్వనిస్తూ అందరి హృదయాంతరాళాలలోనూ ఉత్తేజాన్ని రేకెత్తిస్తుంది. 'భారత్ మాతాకీజై' అంటూ ముగించబడే ఆ ప్రార్థన యావత్తు కార్యక్రమానికి మణిపూసలాంటిది.

ఇది మనదేశంలో తరచు కానవచ్చే దృశ్యం. మనదేశీయుల హృదయాలను ప్రేమాభిమానాలతో నింపివేసే దృశ్యం. భారతదేశమంతటా నగరనగరాలలో, గ్రామగ్రామాలలో, కొండలలో, కోనలలో — నియమిత సమయములందు నిత్యమూ ఉభయసంధ్యలందును, నిశాసమయమందు కూడా—ఈ స్ఫూర్తివంతమగుదృశ్యాలు, హృదయాన్ని కదిలించే గీతాలు మనకు దర్శనమిస్తాయి.

ఒకమారు వివేకానందుని అనుంగు శిష్యురాలైన సోదరి నివేదిత "హిందువులంతా అనుదినమూ ఉదయమూ సాయంకాలమూ పదినిమిషాలు సమష్టిగా ప్రార్థనచేస్తేచాలు, హిందూసమాజం అజేయంగా నిలువగల్గుతుంది" అని చెప్పింది. ఆదృశ్యం ఆమె స్వప్నానికి రూపకల్పన.

అందున్నదెవ్వరు ? వారేసంస్థకు చెందినవారు ?

వారు సంఘ స్వయంసేవకులు. అది రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్.

ఒకానొకప్పుడు విఖ్యాతదేశభక్తుడగు విఠల్‌భాయ్‌పటేల్ సంఘస్థాన్ కార్యక్రమాన్ని తిలకించి "నాకిచట జాతీయపునరుజ్జీవన అంకురాలు కనుపిస్తున్నాయి" అని అన్నారు. సంఘ స్థాపకులైన డాక్టర్ హెడగెవార్‌గారితో మహాత్మాగాంధీ "నా కలలకు మీరు రూపమిచ్చారు" అన్నారు.

## జాతికి ధన్వంతరి

ఈ అద్భుతమైన జాతీయపునరుజ్జీవన పథకాన్ని ఎవరు రూపొందించారు ? వారు దీన్ని ఎలా అమలుపరచగలిగారు ?

వారిపేరు డాక్టర్ కేశవ్ బలీరామ్ హెడగెవార్. నాగపూర్‌లో 1889 లో జన్మించారు. నవయుగానికి నాందిపలుకుతున్నట్లుగా వారు ఉగాది

పర్వదినాన జన్మించారు. బాల్యంలోగూడ వీరి ప్రచండమైన దేశభక్తి భావన అందరికీ ప్రస్ఫుటమవుతూవుండేది. పెద్దలనుగూడ ఆశ్చర్యపరచేప్రశ్నలను బాలుడగు కేశవరావ్ అడుగుతుండేవాడు. "ఆరువేలమైళ్ళ దూరంనుండి వచ్చిన ఈ కొలదిమంది విదేశీయులు మనలను ఎలా పాదాక్రాంతులుగా చేసుకోగలిగారు ?" అనే ప్రశ్న అతని మనస్సులో మెదిలేది: విక్టోరియా రాణి వజ్రోత్సవ సందర్భంగా పాఠశాలలో తినుబండారాలు పంచిపెడితే ఎనిమిదేండ్ల బాలుడగు కేశవుడు వాటిని దూరంగా విసిరి పారవేశాడు: "విదేశీ పరిపాలకుల విజయోత్సవాలు జరిపి, విందులు చేసుకోవడం సిగ్గుచేటుకాదా ?" అని ఆ బాలుడు ప్రశ్నించాడు. అతడు ఉన్నత పాఠశాలలో ప్రవేశించిన పిదప, ఆ కాలంలో విద్రోహకరంగా భావించబడ్డ 'వందేమాతరం' నినాదం ద్వారా, నాగపూర్ విద్యార్థులను ఉత్తేజపరచాడు. అందుకు ప్రతిఫలంగూడ ఆయన అనుభవించవలసి వచ్చింది. ఉన్నత పాఠశాలనుండి అధికారులు ఆయనను బహిష్కరించారు. సంతోషంతో శిక్షను భరించాడు. ఆ తరువాత అనేక వూర్లు తిరిగి తిరిగి తుదకు పూనాలో మెట్రిక్యులేషన్‌లో కృతార్థుడైనాడు.

కేశవుని తల్లిదండ్రులు నిరుపేదలు. అతని పసితనంలోనే వాళ్ళు దాటిపోయారు. దీనికి తోడు, దేశభక్తి నేరానికి అతడు తీవ్రమైన సంకటాలకు గురికావలసివచ్చింది. ఐతే అతని జ్వాజ్వల్యమానమైన దీక్షను ఏసంకటమూ బలహీనపరచలేకపోయింది. బాధల ఒరపిడితో అతని శీలము మరింతగా ప్రకాశింపజొచ్చింది.

మెట్రిక్యులేషన్ అనంతరం ఆనాటి విప్లవయోధులకు కాశీవంటి పవిత్ర స్థలంగా రూపొందిన కలకత్తాలో పై చదువు చదవాలని ఆయన నిర్ణయించుకున్నారు. కలకత్తా జాతీయ వైద్య కళాశాలలో ప్రవేశించారు. యావద్భారతంనుండి అటకు వచ్చియున్న యువక దేశ భక్తుల కాయన కర్ణధారిగా నిలిచారు. వంగప్రాంత జీవనంతో

పూర్తిగా కలిసిపోయి వివిధ విద్యార్థి ఉద్యమాలలోను, సంఘసేవాకార్య ములలోను ప్రధాన పాత్ర వహించారు. ఎల్. ఎమ్. ఎస్. పరీక్షలో ఉత్తమ శ్రేణిలో కృతార్థులుకాగా, సన్నిహిత మిత్రులందరూ ఆయనను ఆప్యాయంగా 'డాక్టర్' అని పిలిచేవాళ్ళు. ఆయన 1916లో నాగపూర్ తిరిగి వచ్చారు. యువకుడగు ఆ డాక్టర్‌కు గులాబిపూల పాన్పు ఎదురుగా తనకై వేచివున్నట్లు కనిపించింది. కాని ఆయన చెవులలో దేశమాత పిలుపు వినబడుతున్నది. ఆయన ముళ్ళత్రోవనే ఎన్నుకున్నారు. చాలాకాలం క్రిందటనే తాను ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపోయి, మాతృ భూమి సేవలో జీవన పుష్పాన్ని సమర్పించాలని నిర్ణయించుకున్నారు. తదనుగుణంగా జాతికి వైద్యుడుగా వ్యాధిగ్రస్తమైన యీజాతికి సేవచేయాలని నిశ్చయించుకున్నారు.

## వ్యాధి నిర్ణయం

భారతదేశ సముద్ధరణకై దేశంలో ఆనాడు కృషిచేస్తున్న వివిధ ఉద మాల స్వరూప స్వభావాలను డాక్టర్ హెడగెవార్ పరిశీలించడ మారంభించారు. కాంగ్రెసులోను, హిందూమహాసభలోను ఆయన కొన్ని బాధ్యతాయుతస్థానాలలో వుండి పనిచేశారు.ఆయన ఒక మరాఠీ దినపత్రికను స్థాపించి, సంపాదకత్వం వహించారు. సహజోత్సాహముతో బాతు నీటిలో దుముకునట్లు, దేశభక్తిని పుట్టుకతోనే అలవరచుకున్న ఆ మహ నీయుడు అనేక స్వాతంత్రోద్యమాలలో దుమికి కారాగారవాసం అనుభ వించారు, సంఘసేవా కార్యక్రమాలలోగూడ పాల్గొన్నారు. కాని ఇవి ఆయనను తృప్తిపరచలేకపోయాయి. వీటిద్వారా జాతీయస్వాతంత్ర్యము, దేశముయొక్క చిరంతనకీర్తి సాధించుకొనగలమని ఆయన విశ్వసించలేక పోయారు.

కేవలం ఆంగ్లవ్యతిరేకోద్యమాలు జాతియొక్క బలహీనతలను నిర్మూలించగలవా అని ఆయన తనలోతాను ప్రశ్నించుకున్నారు. జాతీయజీవనంలో కనిపించే అన్ని వైపరీత్యాలకూ ఆంగ్లపరిపాలనే మూలకారణమనేమాట నిజమేనా? ఆంగ్లేయుల రాకకు పూర్వం మన జాతీయజీవనంలో ఎలాంటి దోషమూ లేనట్లయితే, మనము వాళ్ళకు ఎలా పాదాక్రాంతులమైనాము? అంతకుపూర్వం మనం మహమ్మదీయులకు ఎందుచేత దాసోహమన్నాము? వారి రాకకుపూర్వం మనం స్వతంత్రులం; కాని ఆతరువాత స్వాతంత్ర్యాన్ని కోల్పోయాం. ఎందుచేత? మన జాతీయ జీవనాన్ని ఛిన్నాభిన్నంచేసిన లోపంఏది? దాన్ని తొలగించడం ఎలా? ఆకాలంలో పనిచేస్తున్న ఏఆంగ్ల వ్యతిరేక ఉద్యమాలలోనూ ఈ ప్రశ్నకు సరియైన సమాధానం డాక్టర్‌జీకి లభించలేదు.

ఆ మూలసమస్యను పరిష్కరించడానికై ఆయన నిర్విరామంగా పరిశోధన సాగించారు. జాతియొక్క గతచరిత్రను ఆమూలాగ్రంగా పరిశోధించారు. అందులో ఆయన గ్రహించినదేమిటి?

## చరిత్ర చెప్పే సత్యం

చరిత్రకు అందనికాలంనుంచీ మనదొక మహా శక్తివంతమైన రాష్ట్రం. మనదేశంలో స్వేచ్ఛావాయువులు వీచాయి; సంపద వెల్లివిరిసింది; సంస్కృతి పరిమళించింది. మనసౌజన్యం ప్రపంచాన్ని ప్రభావితంచేసింది. దేశదేశాలలో మనజండా రెపరెపలాడింది. కళలు, శాస్త్రములు, సాహిత్యం, విద్య, మతం, సాంఘిక, రాజకీయ వ్యవస్థలు, రాజనీతి, యుద్ధతంత్రం—ఇలా వివిధరంగాలలో భారతదేశం విదేశీయులనుండి మన్ననలను పొంది గురుస్థానం అలంకరించింది. ఆ వైభవాన్ని చూడడానికి సుదూరదేశాల నుండి యాత్రికులిచటికి వచ్చారు. ఈ పవిత్రభూమిమీద ప్రతి అంగుళం

నుంచీ ఉవ్వెత్తుగాలేచే అవిరళవిజ్ఞానధారలను ఆస్వాదించడంకోసం దేశ దేశాలనుంచి జిజ్ఞాసువులిచటికి వచ్చారు.

దండయాత్రలుచేసి దేశాన్ని భస్మీపటలం చేయదలచిన విదేశీ దోపిడీదారులకుగూడ లోటులేదు. గ్రీకులు, హూణులు, శకులు, పదేపదే దండయాత్రలు చేశారు. ఐతే వారంతా అగ్నిలో దుమికిన శలభములవలె నశించారు. కొందరు సర్వసమృద్ధమైన హిందూజీవనస్రవంతిలో కలిసి పోయారు. ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకోవాలనే పేరాశతో బయలు దేరిన అలెగ్జాండరు ఇచట తన ఆకాంక్షకూ తనకూగూడా శాశ్వతసమాధి నిర్మించుకున్నాడు. స్వదేశానికి మరలి వెళ్తూవుండగా యుద్ధరంగంలో ఒక హిందూవీరుని తీవ్రబాణాఘాతానికి ఎరయై కన్నుమూశాడు.

అలాంటి ప్రచండ పరాక్రమోపేతమైన భారతజాతి గత వేయి సంవత్సరాలలో తనశక్తినీ, గౌరవాన్నీ ఎలా కోల్పోయింది? కొద్దిమంది అనాగరికులైన మహమ్మదీయుల చేతుల్లో మనం ఎందుచేత ఓడిపోయి అవమానింపబడ్డాం? ఉదాహరణకు—ఢిల్లీనుంచి కేవలం పదునెనిమిదిమంది అనుచరులతో బయలుదేరిన భక్తియార్ ఖిల్జీ తూర్పుగావెళ్ళి బెంగాల్ వరకు పాదాక్రాంతం చేసుకున్నాడు. దారిపొడుగునా దారుణహత్యాకాండ చేశాడు; పెద్దపెట్టున మతంమార్పిడులు చేశాడు; దేవాలయాలను శిధిలంచేశాడు; స్త్రీలను అపహరించాడు; రాజ్యాలను కొల్లగొట్టాడు; విశ్వవిఖ్యాతిగాంచిన ంద విశ్వవిద్యాలయంలోని వేలకొలది ఉపాధ్యాయులను, విద్యార్థులను కు నిర్దాక్షిణ్యంగా తెగనరికాడు; వేలకొలది సంవత్సరాల భారతజాతీయ నంలో పదిలపరచబడిన విజ్ఞానచంద్రిక యనదగు నలంద విశ్వవిద్యా ంయ గ్రంథాలయాన్ని అతడు భస్మీపటలంచేశాడు; తుదకతడు బెంగాలులో తన రాజ్యాన్ని స్థాపించుకున్నాడు! గత వేయి సంవత్సరాలలో జరిగిన అనేక ఆశ్చర్యకరమగు విషాదసంఘటనలలో ఒకటి అయిన ఈ విచిత్రం

ఎలా జరిగింది? 18 మంది వ్యక్తులు 1000 మైళ్ళ భూభాగాన్ని పాదాక్రాంతం చేసుకోవడం విచిత్రంకాదూ ?

ఆంగ్లేయులకు దేశం పాదాక్రాంతం కావడం ఇంతకంటె విచిత్ర మైన గాథ. వాళ్ళు ఈ దేశానికి ఖడ్గంతోగాక త్రాసు చేతపుచ్చుకొని వచ్చారు. ఆ కొద్దిమంది వర్తకులకు మన పెద్ద పెద్ద రాజ్యాలు ఎందుకు దాసోహమన్నాయి? ఆంగ్లేయులకూ, ముస్లింలకూ ఉండి మనకు లేకపో యిన దేమిటి? అంగబలమా? అర్థబలమా? ఆయుధాలా? శారీరకబలమా? బుద్ధిబలమా? పరాక్రమమా? లేక యుద్ధతంత్రమా? ఇవేవీకావు. వీటిలో ఎందులోనూ మనకు కొరతలేదు. వాస్తవానికి ఈ అన్ని విషయాలలోనూ శత్రువులకంటె మనం చాలా ఉన్నతస్థాయిలో వున్నాం. అయినా మనం పరాజయం పొందాం. ఎందుచేతనంటే, ఒక్క విషయంలో వాళ్ళకంటె ఎంతో వెనుకబడి వున్నాం. జాతులయొక్క జీవన్మరణ సమస్యను నిర్ణ యించే ఆ ఒక్క విషయంలో మనం అతి దౌర్బల్యస్థితిలో వున్నాం. రాష్ట్రీయ చైతన్యము (National Consciousness), సమైక్యత లేకపోవడమనేదే ఆ విషయం.

## ఆత్మవిస్మృతియొక్క దుష్పరిణామాలు

శతాబ్దాల తరబడి సుఖశాంతులతో, స్వేచ్ఛతో, సంపదలతో, దేశం వర్థిల్లిన పిదప ప్రజలలో అలసత్వం వ్యాపించింది. మనమంతా ఒకే మాతృభూమియొక్క అనుంగు సంతతివారమనే సత్యాన్ని విస్మరించాం. చిల్లర మల్లర రాజ్యాలు తలెత్తినాయి. పరస్పర అసూయ, స్పర్థలు వాటి మధ్య గల సంబంధాలను విషపూరితం చేశాయి. రాజులు వ్యక్తిగత కీర్తి ప్రతిష్ఠలతో మత్తెక్కి శత్రువులెవరో మిత్రులెవరో గుర్తించలేకపోయారు. మనం జాతీయ జీవనంయొక్క ప్రాథమిక పాఠాలను మరచిపోయాం. మన దేశంలోని ఒక భాగాన్ని కొల్లగొట్టిన శత్రువు, మరొకనాటికి దేశంయావత్తూ

కొల్లగొట్టక మానడనీ, దేశ స్వాతంత్ర్యం అవిభాజ్యమనీ మనం మరచి పోయాం. దీని దుష్పరిణామాలు ప్రతిఒక్కరిమీదదారుణంగా వుంటాయనీ, మనం ప్రాణప్రదంగా భావించే ప్రతి వస్తువూ, మన సిరిసంపదలూ, భోగ భాగ్యాలూ, నేలమట్టం చేయబడతాయనీ మనం గుర్తించలేదు.

ఆ విధంగా ఒకప్పుడు మనముందు పాదాక్రాంతులైన శత్రువులు, ఆ తర్వాత గౌరవనీయులైన అతిధులుగా రాగల్గారు. పవిత్ర సోమనాథ దేవాలయాన్ని కొల్లగొట్టి నేలమట్టం చేయ సమకట్టిన ఘజనీ మహమ్మద్‌కు మన స్థానిక ప్రభువులే దారి చూపించి సాయపడ్డారు. ఆ తరువాత కనోజి ప్రభువైన జయచంద్రుడే మహమ్మద్ ఘోరీని దేశంమీదికి ఆహ్వానించాడు. ఈ విధంగా రాజధానీనగరమయిన పవిత్ర హస్తినాపురంలో తొలిసారిగా కరకు తురకల రాజ్య సంస్థాపనకు ఒక హిందూ నృపాలుడే కారణభూతుడైనాడు. జయచంద్రుని సంతతి వేగంగా పెరిగింది. అగ్బరు యొక్క విశాల సామ్రాజ్యానికి రాజా మానసింగు మూలస్తంభ మైనాడు. దేశంలో స్వాతంత్ర్యదీపిక నిలిపివుంచిన ఏకైక దేశభక్తుడగు రాణా ప్రతాపసింహుని కాలరాయడానికి ఆ మానసింహుడే సిద్ధమైనాడు. హిందూధర్మ విఘాతకుడుగా పేరుపడ్డ ఔరంగజేబునకు ప్రధాన ఉపకర ణములుగా పనిచేసిన మీర్జా రాజా జయసింగు, జస్వంతసింగు మున్నగు వారంతా హిందూ సేనానులే. ఔరంగజేబు పక్షాన ఛత్రపతి శివాజీని నాశనం చేయడానికి వారే సిద్ధమైనారు.

ఆత్మహత్యా సదృశమగు యీ విద్రోహగాధ ఆంగ్లేయులకాలంలో గూడ నిరాటంకంగా కొనసాగింది. మహమ్మదీయ దండయాత్రలు నేర్పిన గుణపాఠాలను మనం స్వీకరించలేదు. హిందూ సేనాపతులు, సైనికులు, తమ రక్తాన్ని కార్చి, స్వాతంత్ర్యయోధుల రక్తాన్ని బలిగొని, బ్రిటిష్ సామ్రాజ్యం ఈ దేశంలో క్షేమంగా సురక్షితంగా వుండేటట్లు చేశారు. భాగ్యవంతులగు మన వర్తకులు బ్రిటిష్‌వారికి ధనసహాయం

చేశారు. మన మనుష్యశక్తి, బుద్ధిబలము, ధనము ఆంగ్లేయుల పాదాల ముందు ఉంచబడ్డాయి. వారు మన మిచ్చిన సంకెళ్ళతోనే మనలను బంధించారు.

మన శత్రువులు మన సంపదను కొల్లగొట్టి, మన దేవాలయాలను నేలమట్టంచేశారు. వారు మన పురుషులను ఊచకోతకోసి, స్త్రీలను చెరిచారు. పెద్దఎత్తున ప్రజలను బలవంతంగా తమ మతంలోకి మార్చారు. వారి క్రౌర్యాలతో మనవారిలో బానిసత్వం పొటమరించింది. సంపదకు, వైభవానికీ ఆటపట్టయిన ఈ ప్రాచీనరాష్ట్రము పరాయివాళ్ళ దయాదాక్షిణ్యాల మీద బ్రతికేదుర్గతికి వచ్చింది. ఎటుజూచినా కరువుకాటకాలు, పేదరికము, తాండవించాయి. విశ్వమాత అయిన భరతమాత, ఒకప్పుడు అనేకజాతులకు తలదాచుకోడానికి ఆశ్రయమిచ్చిన ఈతల్లి, నేడు కరువుకాటకాలకు నిలయమైంది.

ఐతే, దీని కంతటికీ బాధ్యు లెవరు? మనమే! భారతమాత పుత్రులమగు మనమే!

మహమ్మదీయులూ, ఆంగ్లేయులూ, మన శత్రువులు? కాదు. మనమే మన శత్రువులం! భగవద్గీతలో చెప్పినట్లు, "మనమే మన మిత్రులం; మనమే మన శత్రులం." దురదృష్టవశాత్తూ మన విషయంలో ఈ వాక్యం లోని రెండవభాగం నిజమయింది.

## చికిత్స

డాక్టర్‌జీ వ్యాధినిర్ణయం చేశారు. మనలను పీడిస్తున్న అసలు వ్యాధి ఏది? రాష్ట్రీయచైతన్యం లోపించడం. మనం 'ఒకే ఒక జాతీయ జీవనం యొక్క వివిధ అంగములము' అనే భావన లోపించడం. తత్ఫలితంగా పరస్పర ద్వేషం, వైరుధ్యం, అవిశ్వాసం, అల్పమగు స్వార్థ

ప్రయోజనాలకోసం పరస్పరం కలహించడం - ఈ దోషాలు గత వేయి సంవత్సరాల పైగా జాతియొక్క ప్రతి రక్తకణంలోనూ ప్రవేశించి జాతిని నిర్వీర్యపరుస్తున్నాయి.

మనం కేవలం బ్రిటిష్ వ్యతిరేక నినాదాలు మాత్రమే ఎలుగెత్తి అరుస్తూ ఈ మూలదోషానికి చికిత్స చేయకుండా పోతే ఏమి ప్రయోజనం?

పుట్టమీద కొడితే పాము చస్తుందా? ఆంగ్లేయులకు ప్రధాన సహాయకారిగావున్న యీ పై దోషాన్ని మనం నివారించుకోనంతవరకు ఆంగ్లేయులను ఈ దేశంనుండి ఎలా తరిమివేయగలం? ఒకవేళ ప్రపంచ పరిస్థితులు కారణంగా గాని, వారి ఆంతరంగిక పరిస్థితులు కారణంగా గాని, అనుకోకుండా ఇంగ్లీషువారు ఈ దేశంనుండి వైదొలగినా, ఎంతకాలం మనమూ స్వాతంత్ర్యాన్ని నిలుపుకోగలం? శత్రువుల విజయావికి కారణమై శత్రువుల నిచటకు రప్పింపజేసిన మన ఘోరమైన బలహీనత అలాగే ఉన్నట్లయితే, మన స్వాతంత్ర్యానికి రక్షణ ఏది? శత్రువు మన స్వార్థపరత్వమును పరస్పర వైషమ్యాలను వినియోగించుకొని మరల ఈ దేశంలో అడుగు పెట్టలేడా?

శరీరం బలహీనంగా ఉన్నంతవరకు ఏదోరకమైన వ్యాధి కది గురి కాక తప్పదు. అలాంటి వ్యక్తికి మధురాతిమధురమైన తినుబండారాలను అందించినా, జీర్ణించుకోలేడు. వాటిని నోటకరుచుకు పోదలచిన కుక్కను గూడా అతడు తరిమివేయలేడు. దేశం విషయంగూడ ఇట్టిదే అంతర్గతంగా డొల్ల అయిపోయిన జాతి ఎల్లప్పుడూ దురాక్రమణదారుల వాత పడుతూనే ఉంటుంది.

రాష్ట్రీయ చైతన్యాన్ని రగుల్కొల్పి, సుదృఢ జాతీయశక్తిని నిర్మించడమొక్కటే జాతి మనుగడకు శ్రీరామరక్ష; పరాధీనమైన జాతి తన దాస్యశృంఖలాలను త్రెంచుకొని బయటపడడానికి శక్తిమంతమగు ఆయుధం; స్వతంత్రదేశం తన స్వేచ్ఛను కాపాడుకొనడానికి దుర్భేద్యమైన కవచం.

బలమే జీవనము, బలహీనతే మరణము.

సుసంఘటితమై, జాగ్రదవస్థలోనున్న జాతి మాత్రమే శక్తిని పెంపొందించుకొంటుంది. ఐకమత్యములో బలమున్నదని బాలునికిగూడ తెలుసు. విడివిడిగానున్న నారపీచులో బలములేదు; కాని దానినే ఒక త్రాడుగా పేనితే అది ఒక ఏనుగునుగూడ బంధించగలదు; జాతి విషయంలోనూ ఇంతే.

ఎంత విశాలమైన భూభాగము, జనసంఖ్య కలిగివున్నా, పారిశ్రామికంగా ఎంత ముందడుగు వేసినా, ఎంత సంపద పెంచుకున్నా, స్వార్థపూరితులగు వ్యక్తులతో, మతాలతో, అనైక్యముగా నున్న జాతి శక్తిలేనిదే అవుతుంది

"జీవో జీవస్య జీవనం" అను అరణ్యన్యాయము ననుసరించి నడుస్తున్న ఈ ప్రపంచంలో బలహీనమైన జాతికి మనుగడలేదు. పెద్దచేప చిన్న చేపను మ్రింగునట్లు, శక్తిమంతమగు జాతులు బలహీనమగు జాతులపై దండెత్తి వశపరచుకుంటాయి. యుగయుగాలనుండి ఈ నాటి వరకు ప్రపంచ చరిత్ర నేర్పే విస్పష్టమైన పాఠమిది. అందుచేత ఒక జాతి స్వతంత్రంగా జీవించడానికి ఏకైకమార్గం శక్తిమంతం కావడం. శక్తి నిర్మాణానికి మార్గం ప్రజలలో జాతీయభావనను జాగృతపరచి, వారిని సంఘటితపరచడమే.

మనం మరొక విషయాన్ని గూడ గమనించాలి. కేవలం ఉన్నత ఆశయాలను, గొప్ప సిద్ధాంతాలనూ చిలకవలె వల్లెవేయడం ద్వారా ఒకజాతి మనజాలదు. ఒక జాతిని సజీవంగా నిలిపివుంచడం ఒక ప్రత్యేకమైన కళ. అది జాతిలో ఏకత్వాన్ని సృష్టించి, అజేయమైన శక్తిని నిర్మాణం చేయడం. జాతీయ జీవనానికి పవిత్రతను, సౌందర్యాన్ని చేకూర్చే మిగతా అన్ని కళలూ ప్రధానంగా ఈ కళమీద ఆధారపడుతాయి. తాను అల్లుకొనే

చెట్టు బలంగా ఉన్నంతవరకే లత వర్ధిల్లుతుంది. కాని ఒకసారి చెట్టు పడిపోతే, లత గూడా వాలిపోతుంది. ఒకప్పుడు సంస్కృతిని గూర్చి, మత ధర్మాలనుగూర్చి, వేదాంతాన్నిగూర్చి, మనం యావత్ప్రపంచానికి బోధించాం. ఐతే ఎప్పుడైతే మనజాతి అనైక్యముతో బలహీనమై పోయిందో, అప్పుడు మన స్వరము హీనమై లోకానికి విన్పించకుండా పోయింది, తండోపతండాలుగా అనాగరిక మూకలు మనపై దాడిచేసి మన మహత్తర ప్రబోధాలను అణచివేశాయి.

అందుచేత, రాజకీయ ఆందోళనలకంటెను, సాంఘిక సంస్కారణోద్యమాలకంటెను, ఆర్థికాభివృద్ధి పథకాలకంటెను, గొప్ప సిద్ధాంతాలు వల్లించడంకంటెను, రాష్ట్రీయచైతన్యాన్ని రగుల్కొల్పి, యావత్తు సమాజాన్ని ఒక్క త్రాటిమీదకు తీసుకొని వచ్చే రాష్ట్రీయ సంఘటనా కార్యక్రమం వేయిరెట్లు ఎక్కువ అవసరమని డాక్టర్ హెడగెవార్ నిర్ణయించారు.

## ఈదేశంలో జాతీయు లెవరు ?

మనచరిత్రకు సంబంధించి డాక్టర్‌జీ జరిపిన కూలంకష పరిశీలన–వివిధ జాతీయ కార్యకలాపములందు ఆయన అనుభవము– మరొక ముఖ్యమైన జాతీయసమస్యకు పరిష్కారం సూచించాయి. మనదేశంలో 'జాతీయ నవ్నిర్మాణము' అనేది దేనినిసూచిస్తుంది? మనము సంఘటితపరచవలసిన 'జాతీయు" లెవరు ? అసలు ఇచట రాష్ట్రీయులెవరు ? మహానాయకులను సైతం ఎదుర్కొన్న సమస్య ఇది.

చరిత్ర పుటలను పైపైన తిరగవేసినా అనాదికాలంనుండి హిందువులే ఈగడ్డన పుట్టి పెరిగిన బిడ్డలని తెలియగలదు. వారి కిది కేవలం మాతృభూమియేకాదు, పుణ్యభూమిగూడాను. తరతరాలుగా వారు తమ ప్రచండపరాక్రమాన్ని ప్రదర్శించి, వేడిరక్తాన్ని ధారపోసి దేశ

స్వాతంత్ర్యాన్ని పరిరక్షిస్తూ వచ్చారు. ఈ భరతభూమి సంస్కృతి ధర్మాలను వారు నిలబెట్టారు. ఈ దేశానికి ఎనలేని ఘనత చేకూర్చిన వేదములను, భగవద్గీతను, ఉపనిషత్తులను, రామాయణమును, భారతము మొదలగు పవిత్రగ్రంథాలను రచించినది ఈసమాజమే. జాతీయజీవనంలోని ప్రతిరంగములోను మహోన్నత శిఖరాల నందుకున్న మహర్షులను, యతీంద్రులను, కన్నది ఈసమాజమే. అందువల్ల నిస్సందేహంగా హిందువులే ఇచటి జాతీయజీవన నిర్మాతలు. వారే ఇచటి జాతీయులు. ఇది హిందూరాష్ట్రం. ఈమాటకు తిరుగులేదు.

రాష్ట్రీయతకు సంబంధించిన ఈ వాస్తవాన్ని గ్రహించకుండానే, జాతీయ ఆదర్శాన్ని-జీవించినా మరణించినా జాతికొరకే అనేదాన్ని-ప్రజల ముందుంచడం, అది వారి రక్తంలో జీర్ణించిపోయేటట్లు చేయడమూ ఎలా? వారికండ్లముందా సజీవదృశ్యం లేకుండా ప్రజలు త్యాగభావంతో ఎలా విజృంభిస్తారు? ఇవీడాక్టర్‌జీకి కల్గిన భావాలు. నిజానికి స్వచ్ఛమైన రాష్ట్రీయతలేని జాతీయస్వాతంత్ర్యం అర్థరహితం.

అందువల్ల ఈ జాతీయ పునర్నిర్మాణ పథకం హిందూరాష్ట్రీయత అనే పరమసత్యముపై ఆధారపడే జరిగితీరాలనే నిర్ణయానికి వచ్చారు డాక్టర్‌జీ.

## మహాయజ్ఞ ప్రారంభం

ఈ నిశ్చయాలకు తాను వచ్చిన మరుక్షణంలో జాతీయ పునర్నిర్మాణ మహాలక్ష్యాన్ని సాధించడానికై తగుమార్గాలను వారు అన్వేషించ నారంభించారు. వివిధ ఉద్యమాలలోను, సంస్థలలోను, వారికిగల పుష్కలమైన అనుభవంతో వారి అవగాహన పరిపక్వమయింది. మాతృదేవి సేవలో వారి శ్రద్ధానుభవాల పర్యవసానంగా పరంపరాగత విజయోత్సవమగు

విజయదశమీ పర్వదినాన, నాగపూర్‌లో, రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ అవతరించింది.

స్థాపింపబడిననాటినుంచీ, విజయదశమియొక్క పరంపరకు అనుగుణంగా, సంఘం దినదినాభివృద్ధిచెందనారంభించింది. డాక్టర్‌జీ తన రక్తంతో ఆ అంకురాన్ని పెంచి పోషించారు. క్రమేణా ఆయన ఇతర కార్యకలాపాలనుండి తప్పుకొని జాతీయ పునర్నిర్మాణ మహాకార్యానికే తన యావచ్ఛక్తినీ కేంద్రీకరించారు. సంఘమే వారి ఉచ్ఛ్వాసనిశ్వాసమైపోయింది. వారి సన్నిహిత అనుచరులు వారి మనస్సెరిగి సంఘకార్య విస్తరణకై తమ జీవితాలను అంకితం చేశారు. సాధ్యమైనంత త్వరితంగా హిందువులను సంఘటితపరచే దృఢనిశ్చయంతో సంఘకార్య విజృంభణ ప్రారంభమయింది.

దాదాపు అదేసమయంలో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. దేశమంతటా ఆంగ్లేయులఎడ వ్యతిరేకత వెల్లువలా వ్యాపించింది. సైన్యానికి, నౌకాదళానికి గూడ వ్యాపించింది. అలసిపోయిన బ్రిటన్ ఇక భారతదేశాన్ని తన గుప్పిట్లో నిలుపుకోలేనని గుర్తించింది. భారతదేశం నుండి నిష్క్రమించడానికి బ్రిటిష్‌వారు నిర్ణయించుకున్నారు. వారు బర్మా, సింహళములను గూడ వదలివెళ్లాలని నిశ్చయం చేసుకున్నారు.

## స్వప్నం నిజమైంది

ఆంగ్లేయులు దేశాన్ని వదలివెళ్లిన పిదప డాక్టర్‌జీ చెప్పిన స్వప్నం నిజమని తేలింది. ఏ కారణాలవల్లనైనా ఆంగ్లేయు లీదేశాన్ని వదలివెళ్ళినట్లయితే, హిందువులు సుసంఘటితులై శక్తిమంతమైన జాతిగా ఏర్పడని పక్షంలో, మన స్వాతంత్ర్యాన్ని మనం పరిరక్షించుకోగలమనే హామీ ఏమున్నది? అది వారు ఎన్నడో వేసిన ప్రశ్న. దానికి జవాబు పాకిస్తాను నిర్మాణం రూపంలో వచ్చింది. చరిత్ర పునరావృత

మైనది. దురదృష్టం మనకు చరిత్రనుండి గుణపాఠం నేర్చుకోవటమనేది లేదు. పెద్ద పెద్ద భూఖండాలు-బెంగాలులో అర్ధభాగం, పంజాబులో అర్ధ భాగం, సింధు, సరిహద్దురాష్ట్రం శత్రువుల చేజిక్కాయి.

అవి ఒకానొకప్పుడు హిందూజాతి వైభవానికి ప్రతీకములు. మన ప్రాచీన పరంపరలోకెల్ల పవిత్రమైన వేదముల గన్న భూమి పంజాబు. మన మహర్షులు తపస్సులొనరించిన తావులు సింధునదీతీరాలు. స్వతంత్ర హిందూ నృపాలుర ఆజ్ఞలు శిరసావహింపబడిన ప్రదేశ మది. కాని వేయేండ్ల క్రిందట ఆ ప్రదేశములు మ్లేచ్ఛదండయాత్రల కెఱయైనాయి. కొంతకాలానికి అవి ముస్లిం అధిపత్యాన్ని విదల్చివైచుకొన్నా, పిదప బ్రిటిష్ వారి పాదాక్రాంతమైనాయి. ఇపుడు మరల మహమ్మదీయ ఆక్రమణ లోకి పోయాయి.

## కార్య కారణ నియమము

1947 లో ముస్లింల వశమయిన తరువాత ఆ ప్రాంతాలలో లక్ష లాది హిందూ స్త్రీ పురుషులు దారుణంగా ఊచకోత కోయబడ్డారు. భారతనారీ గౌరవం కాలరాయబడింది. పిచ్చుకత్తుల నీడల క్రింద హిందువుల మతాంతరీకరణ భారీయెత్తున జరిగింది. వేయి సంవత్స రాల క్రిందట హిందూ ప్రజలమీద ముస్లిం కిరాతకులు చేసిన అమానుష ఘాతుకచర్యలు మళ్ళీ జరిగాయి. ఆ కిరాతకత్వం అదే స్థాయిలో అదే రాక్షసత్వంతో ఈనాటికీ అచట సాగుతూనే ఉన్నది. ప్రతిరోజూ పశ్చిమబెంగాల్‌లోనికి ప్రవాహంలా వచ్చిపడుతున్న వేలకొలది శరణార్థి సోదరులను చూస్తేనే గుండె చెరువవుతుంది. అచట జరిగే మారణ కాండకు ఇంతకంటె మరొక దాఖలా ఎందుకు ?

వేయి సంవత్సరాల క్రిందట, మరల ఇప్పుడుగూడ జరుగుచున్న ఈ ఘోరకలికి, అపుడూ ఇపుడూ గూడా మూలకారణం ఒక్కటే. ఈ దేశం

సంతతి అయిన హిందువులలో సుసంఘటితము,ఏకోన్ముఖము అయిన జీవనం లేకపోవడమే ఆకారణం. కార్యకారణ న్యాయానికి స్థలము, సమయము అనే పరిమితులు లేవు. గత వేయి సంవత్సరాల చరిత్రలోని ప్రతి పుట గూడా మన జాతీయ జీవనంపై ఈ కటు సత్యం ఎలా ప్రభావం కలిగివున్నదో తెలిపే మూగసాక్షి.

ఆంగ్లేయులు వదలివెళ్ళిన తర్వాత మన వశంలోకి వచ్చిన ఇతర ప్రదేశాలలో పరిస్థితులు ఎలా ఉన్నాయో చూద్దాం. కనీసం అక్కడైనా స్వేచ్ఛ, గౌరవము పరిరక్షింపబడుతున్నాయా ?

## మతం మార్పిడి ప్రమాదాలు

డాక్టర్‌జీ జోస్యం ఇక్కడగూడా మనలను వెంటాడుతూనేఉన్నది. మన జాతీయ జీవనం హిందుత్వంతో ముడిపడివున్నదనే సత్యాన్ని, మన దేశంయొక్క స్వేచ్ఛ అఖండత్వాలు, హిందూసమాజంయొక్క బలంమీద ఆధారపడివున్నాయనే నిజాన్ని, బుద్ధిపూర్వకంగా విస్మరించి, ఒకస్వతంత్ర జాతిగా మన మనుగడకే విఘాతం కలిగిస్తూ విస్పష్టంగా కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న అపాయాలను చూడకుండా కళ్ళు మూసుకుంటున్నాం.

విదేశీమతాలలోకి హిందువులు మార్చబడడమే ఉన్నదనుకోండి. అట్టి మతం మార్పిడుల వెనుకనున్న ఘోరవిపత్తులనుగూర్చి ప్రత్యేకించి ఈనాడు వర్ణింపనవసరంలేదు. డెబ్బదియేండ్లక్రిందట స్వామివివేకానందుడు ఇలా హెచ్చరించాడు : "హిందూసమాజంనుండి వెలుపలికిపోయే ప్రతి ఒక్కరివలన మనకు ఒకహిందువు నష్టంకావడమేగాక శత్రువుకు ఒక సంఖ్య పెరుగుతోంది". ఈ హెచ్చరిక ప్రమాదంయొక్క తీవ్రతను స్పష్టం చేస్తోంది.

విపత్పరంపర

దాదాపు ఎనిమిదికోట్లమంది హిందువులు మహమ్మదీయులుగా మార్చబడినందువల్లనే పాకిస్తాను నిర్మాణం సంభవమైనదనేది చరిత్రలో కన్పించే వాస్తవిక విషయం.

స్వాతంత్ర్యంపొందిన 17 సంవత్సరాలపిదపగూడా కాశ్మీరుసమస్య మనలను ఆందోళనపరచడానికిమూలకారణం ఆప్రాంతంలోని మహమ్మదీయ సంఖ్యాధిక్యతయేగద : "కొన్నిదశాబ్దాలక్రిందట కాశ్మీరులోని ముస్లింనాయకులు మహారాజాను సందర్శించి తమను మరల హిందూసంఘంలోకి స్వీకరించవలసినదిగా కోరాయి. కాని కాశీపండితులు మతనిబంధనల సాకుతో అడ్డుతగిలాయి. అందుచేత సంస్థానం మహమ్మదీయ సంఖ్యాధిక్యంగా ఉండిపోయింది. అలాజరుగకపోతే ఈనాడు కాశ్మీరుసమస్యే ఉండేదికాదు" అన్నారు రాష్ట్రపతి రాధాకృష్ణన్.

అస్సామును ముస్లిం అధికసంఖ్యాకప్రాంతంగా మార్చివేయాలని పాకిస్తాను ఇప్పుడు నిర్విరామంగా కృషి చేస్తోంది. తూర్పుబెంగాల్‌నుంచి లక్షలాది ముస్లిములు దొంగచాటుగా అస్సాములో ప్రవేశించి స్థిర నివాసాలేర్పరచుకున్నారు. ఆ ప్రయత్నం ఇంకా సాగుతునే ఉన్నది. అస్సాములోని స్థానిక ముస్లిములు వస్తున్నవారికి వసతులు ఏర్పరుస్తున్నారు ఎందువల్ల ? ముస్లిములకు సంఖ్యాధిక్యత లభించిన మరుక్షణంలో అస్సాము భారతదేశంనుంచి తెగత్రెంపులు చేసుకొని పాకిస్తానులో లీనమవుతుంది అని వారి విశ్వాసం.

ఈనాడుగూడా భారతదేశంలో చాలాపట్టణాలలో ముస్లిములు తరుచుగా పాకిస్తాను జెండాలు ఎగురవేస్తున్నారు. ముస్లింలీగుయొక్క విద్రోహకర కార్యకలాపాలు మరల ప్రమాదస్థాయిలోకి వచ్చాయి. ఈ మధ్య జరిగిన మదరాసు కార్పొరేషన్ ఎన్నికలసమయంలో వాళ్లు "పాకిస్తాన్ జిందాబాద్"

అని నినాదాలు ధైర్యంగా ఇవ్వగలిగారు, దేశంలో వందలాది కీలక ప్రదేశాలలో వైర్‌లెస్ ట్రాన్స్‌మిటర్లు రహస్యంగా నెలకొల్పుకొని పాకిస్తానుకు రహస్య సమాచారాలను ఎప్పటికప్పుడు అందజేస్తున్నారు. భారతదేశమంతటా మసీదులు రహస్య ఆయుధాగారాలుగా మార్చివేయబడ్డాయి. కలకత్తాలోని ఒక్క నఖోడామసీదులోనే పట్టణం యావత్తూ ధ్వంసంచేసివేయ కలిగినన్ని ఆయుధాలు, మందుగుండుసామగ్రి, సేకరించబడి వున్నాయని ఇదివరలో కలకత్తా పోలీసు కమీషనర్‌గా ఉన్న అధికారి వెల్లడి చేశాడు. దేశంలోని ప్రతి మసీదు, ప్రతి ముస్లింపేట. చిన్న చిన్న పాకిస్తానులుగా తయారైనాయి.

క్రైస్తవమతంలోకి హిందువుల మార్పిడి గూడ ఇట్టి కుతంత్రంతోనే జరుగుతోంది. మహాత్మాగాంధీ ఒకప్పుడు "హిందూదేశంలో హిందూ మతాన్ని కూకటివ్రేళ్ళతో సహా పెకలించివేసి, మరొక మతాన్ని ప్రతిష్ఠాపన చేయడమే ఇచట క్రైస్తవ మిషనరీల ఆశయం ........ నాకే గనుక శాసనం తయారుచేసే అధికారమే వుంటే, మతాంతరీకరణను ఆపివేస్తాను. అమాయక జనులను ఇలా తప్పుత్రోవల పట్టించడాన్ని తీవ్రంగా అధిక్షేపిస్తున్నాను"—అని అన్నారు.

నాగభూమిలో క్రైస్తవులుగా మారిన నాగాల సహాయంతో క్రైస్తవ మిషనరీలు సాయుధ తిరుగుబాటు ద్వారా స్వతంత్ర ఫాదరీస్తాన్ నిర్మించుకోడానికి చేస్తున్న యత్నం, జరుగుచున్న గాధ అందరెరిగినదే. ఇంతేకాక జార్ఖండ్‌లోనూ, అస్సాము పర్వత ప్రాంతాలలోను, దేశంనుండి విడిపోయే భావాలను రేకెత్తిస్తున్నవారు క్రైస్తవులే. కేరళలో విఖ్యాతి చెందిన శబరిమలై దేవళంతోసహా అనేక వందల పవిత్ర హిందూ దేవాలయాలు నేలమట్టం చేయబడటం, కన్యాకుమారివద్ద గల వివేకానంద శిలమీద ప్రతిష్ఠించబడిన స్వామి వివేకానంద స్మారక ఫలకం

తుత్తునియలు చేయబడటం, ఆయా ప్రాంతాలలో క్రైస్తవ ప్రాబల్యంయొక్క ప్రత్యక్ష ఫలితం :

భారతదేశంలో గోవా సంపూర్ణ విలీనానికి వ్యతిరేకంగా అడ్డు తగులుతూ ఆందోళన చేస్తున్నదికూడ క్రైస్తవులే. గోవా పోర్చుగీసు పరిపాలననుండి విముక్తమయినందుకు, అచట క్రైస్తవ పరపాలన అంతమయినందుకు వారు కన్నీరు కార్చారు. ఇపుడు గోవాను స్వతంత్ర క్రైస్తవరాజ్యంగా రూపొందించడానికి వారు అన్ని ప్రయత్నాలూ చేస్తున్నారు. ఈ క్రైస్తవ కుతంత్రాలను గోవా ముఖ్యమంత్రి బందోద్కార్ బట్టబయలు చేశారు.

మాజీ లోకసభ స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగార్ ఇలా హెచ్చరించివున్నారు. "హిందువులు మహమ్మదీయులుగా మారడంవల్ల పాకిస్తాన్ ఏర్పడింది. అదేవిధంగా హిందువులు పెద్ద సంఖ్యలో క్రైస్తవ మతంలోకి మార్చబడటం ఇలాగే కొనసాగుతూవుంటే, భారతదేశం మళ్ళీ విభజించబడి క్రీస్తుస్తాన్ ఏర్పాటుకు దారితీయగలదని నేను భయపడు తున్నాను. దేశంలోని క్రైస్తవమత ప్రచారసంస్థలు ప్రతి సంవత్సరం తమ కుత్సిత కార్యకలాపాలకై 30 కోట్ల రూపాయలు వ్యయపరుస్తున్నాయి."

## పునరావృతమవుచున్న చరిత్ర

ఇలా విపత్కర పరిస్థితులు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నా, అత్యధిక సంఖ్యలో హిందువులు, ఇస్లాములోకీ, క్రైస్తవమతంలోకీ, భారీ యెత్తున మార్చివేయబడుతున్నా, గమనించకుండా కళ్ళుమూసుకొని కూర్చుంటున్నాం.

ఈమధ్య వెలువడిన వార్త ప్రకారం కలకత్తాలోని నఖోడా మసీదులో మూడు సంవత్సరాల వ్యవధిలో 10,000 మందికి పైగా హిందూ

యువకులు, యువతులు, మహమ్మదీయులుగా మార్చబడ్డారని విశద మవుతోంది. న్యాయస్థానంలో ఆ మసీదుయొక్క ఇమాము స్వయంగా యీ విషయాన్ని వెల్లడించాడు. ఒక్క మసీదులో ఒక్క మౌల్వీ ద్వారా జరిగిన పనే అంత భయానకమైనదీ, తీవ్రమైనదీ కాగా, దేశవ్యాప్తంగా ఎంత ఘోరంగా మతం మార్పులు జరుగుతున్నాయో ఊహింపజాలని విషయం.

క్రైస్తవమతంలోకి హిందువుల మార్పిడి గూడా అధికంగానే వున్నది. దాదాపు 25,000 మంది క్రైస్తవ మిషనరీలు యీ పనిలో వున్నారు. వారు కట్టిన పాఠశాలలు, ఆసుపత్రులు, అనాధ శరణాలయాలు, అన్నీ ఇందుకోసమే. ఫలితంగా మనం నిముషానికొక హిందువువంతున కోల్పోతున్నాం.

ఈ విధంగా హిందూ జనాభా ముస్లిం క్రైస్తవ సంఖ్యలతో పోల్చి చూస్తే అత్యంత ప్రమాదకరంగా క్షీణిస్తున్నది. 1952 జనాభా లెక్కలు యీ విపత్కర పరిస్థితిని వెల్లడిచేస్తున్నాయి ఇందుమూలాన శత్రువులకు దేశంలో బలమైన స్థావరాలు ఏర్పడి దేశం మరల విచ్ఛిన్నమయే ప్రమాదం స్పష్టంగా కానవస్తోంది.

ఈ విషాదకరమగు పరిణామాలన్నీ మన కళ్ళముందే మన లవలోనే జరుగుచున్నాయనే విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. 'అదిమంది విజాతీయవర్గాలు మన మత ధర్మాలను కాలరాచివేసి, మన స్వాతంత్ర్యాన్ని సవాలుచేసి, మన రక్షణకు ప్రమాదం కలిగించి, యధేచ్ఛగా దేశద్రోహ కార్యకలాపాలు సాగించడం 40 కోట్ల జనసంఖ్య గల జాతికి ఎంత సిగ్గుచేటు!

ఐతే యిందులో ఆశ్చర్యమేమీ లేదు, కేవలం చరిత్ర పునరావృత మవుతూ ఉన్నది. నిజమైన జాతీయ జీవనమును విస్మరించి,

తమను పరస్పరము కలిపివుంచే స్నేహబంధములను కోల్పోయిన ప్రజలు ఇలాంటి దుస్థితికి గురిగాక తప్పదు. అనైక్యతతో ముక్కలు ముక్కలై పోయి, జాతీయ సమైక్యతా చిహ్నాలన్నిటిని పోగొట్టుకొని, 40 కోట్లమంది భారత ప్రజలు తమ కళ్లెదుట జరుగుతున్న యీ అవమానకర దృశ్యాలను కళ్ళారా చూస్తూ నిర్వీర్యులై పడివున్నారంటే, అందులో ఆశ్చర్యమేమున్నది? స్వార్థంలో నిండా మునిగిపోయి, అల్పమైన స్పర్థలతో, వైషమ్యాలతో కీచులాడుకొనే మనకు యావత్తు జాతియొక్క మంచి చెడ్డలను గురించి ఆలోచించడానికైనా వ్యవధి లేదు; శక్తిలేదు. దేశాన్ని ఆవరించి వున్న అవినీతి, లంచగొండితనము, జాతిని తొలిచివేస్తున్న జాడ్యముయొక్క బాహ్యలక్షణములు మాత్రమే.

## ఇంటా బయటా శత్రువులు

ఇలా క్షీణించే పరిస్థితులే కమ్యూనిస్టులకు మంచి అవకాశం. అవినీతివలన, సౌశీల్యరాహిత్యంవలన. జాతీయ జీవనం ఛిన్నాభిన్నమైపోతే కమ్యూనిస్టు సామ్రాజ్యవాద తాబేదారులు అధికారాన్ని హస్తగతం చేసుకుంటారు. అలాంటి పరిస్థితులు ఏర్పడిన దేశాలలోనే ఇప్పటివరకు కమ్యూనిస్టులు విజయం పొందారు. మన అంతరంగిక వైరుధ్యాలవలన స్వార్థం పెచ్చుమీరి అవినీతి వృద్ధిచెందడంవల్ల, ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి పరిస్థితులు అనువుగా వున్నాయని వాళ్ల భావిస్తున్నారు. కార్మిక కర్షక ప్రయోజనాలకోసం పాటుపడతామనే బురఖాతో అధికారాన్ని చేజిక్కించుకోవాలని యత్నిస్తున్నారు. త్రిపుర మున్నగు ప్రాంతాలలో వాళ్ల సాయుధ పోరాటానికై స్వంత సైనికదళాలను ఆయత్తపరుస్తున్నారు. చైనా మరొకసారి దాడిచేసే పక్షంలో దేశమంతటా ముఖ్యంగా అస్సాము, త్రిపుర, పశ్చిమ బెంగాలులలో కల్లోలాలు, సాయుధ తిరుగుబాట్లు లేవదీయాలని వాళ్ళు పథకాలు వేసుకున్నారు. ఈమధ్య విజయవాడలో

వేలకొలదిఇళ్ళు తగులబెట్టడంద్వారా వారికిగల విధ్వంసకప్రవృత్తి ఋజువు చేసుకున్నారు.

దేశంలో పంచమాంగదళాలు ఇలా పెచ్చుమీరిపోతుండగా, బయటి శత్రువులు భారతభూభాగాలమీద దురాక్రమణలు సాగించడంలో ఆశ్చర్య మేమున్నది? పాకిస్తాను నిర్మాణంజరిగిన కొద్దిరోజులకే కాశ్మీరును కబళిం చాలని యత్నించింది. ఇప్పటికే మూడవవంతు కాశ్మీరు పాకిస్తాను ఆధీ నంలో వున్నది. మిగతా కాశ్మీరు, అస్సాములను కబళించడానికి పాకిస్తాను మంత్రాంగం చేస్తున్నది. భారతదేశంలోని ముస్లిములను "విముక్తి" చేస్తా మంటూ పాకిస్తానులో క్రొత్త రాజకీయపక్షమొకటి పైకి వస్తున్నది.

ఇక చైనాసంగతి. ఎంతోకాలంనుండి మన పొరుగురాజ్యంగావున్న టిబెట్‌ను చైనా కబళించింది. దాని సైన్యాలు మన హిమాలయ పర్వత శ్రేణులను దాటివచ్చి తిష్టవేశాయి. 50 వేల చదరపుమైళ్ళ భారతభూభాగాన్ని చైనా సేనలు పాదాక్రాంతం చేసుకున్నాయి. ఇప్పుడు చైనా మనపై మరొక దండయాత్ర చేయడానికి పొంచివున్నది. టిబెట్ తన అరచేయిగాను, లడక్, నేపాల్, భూటాన్, సిక్కిం, నీఫాలు చేతివ్రేళ్ళుగాను చూపే బొమ్మలు ప్రచురించి తను ఆక్రమించబోయే ప్రదేశాలను స్పష్టంగా పేర్కొన్నది. ఇప్పుడు చైనా పాకిస్తానులు మనకు వ్యతిరేకంగా ముఠా కట్టాయి.

ఈవిధంగా మనం రెండు ఘోరవిపత్తులమధ్య చిక్కుకున్నాం. బయటిశత్రువుల దండయాత్ర, లోపల వారి తాబేదారుల కుట్రలు.

1947లో ముస్లిం దౌర్జన్యాలకు జడిసిపోయి దేశవిభజనను అంగీక రించినదిమొదలు చైనా దండయాత్ర జరిగేవరకు, దురాక్రమణదారులకు వరుసగా మనం దాసోహమంటున్నందువల్ల, మనకంటె బలహీనులైన పొరుగుదేశాలుగూడ మనలనుఅవమానించ సాహసిస్తున్నాయి. సింహళంలో

కొన్నిలక్షలమంది భారతీయులకు సాధారణ పౌరహక్కులుగూడ లేకుండా తీసివేశారు. బర్మాలో లక్షలకొలది భారతీయులు తెల్లవారేసరికి బిచ్చగాళ్ళుగా చేసివేయబడ్డారు. శరణార్ధులరాక అక్కడనుండిగూడా ప్రారంభమైనది. మనదేశీయులు జాంజిబారునుంచి, ఆఫ్రికాలోని ఇతర ప్రదేశాలనుంచీ వెళ్ళగొట్టబడ్డారు. ఒక్కమాటలో మనదేశం "శరణార్ధుల దేశం"గా తయారయింది.

## ఆత్మహత్యా సదృశమైన మన నిర్లక్ష్యం

మనజాతి మనుగడకే విపత్తు ఏర్పడిన సమయంలో ప్రజల పరిస్థితి ఎలావున్నది? ఎలా ఆలోచిస్తున్నారువారు? ప్రమాదాలనుగూర్చిన మేల్కువ వారిలో వున్నదా? అజేయమైన సమైక్యదీక్షతో ప్రమాదాల నెదుర్కోడానికి మనం సిద్ధంగా వున్నామా? శత్రువులు మనలో మనకు విరోధాలు పెట్టకుండా, చరిత్ర పునరావృతముకాకుండా మనం మన ఆంతరంగిక వైషమ్యాలను మరచిపోయినామా? మనం ఎదుర్కొంటున్న ఈ క్లిష్టసమయంలో ఐకమత్యంద్వారాను, సంఘటనద్వారాను, మనమొక అజేయమైన జాతీయశక్తిగా రూపొందామా?

దురదృష్టవశాత్తూ ఈప్రశ్నలన్నిటికీ జవాబు 'లేదు' అని చెప్పుకోవలసివస్తోంది. భాష, ప్రాంత, వర్గ, వర్ణ, ఆంతర్వర్ణ విభేదాలుకారణంగా మన నాయకత్వం ప్రమాదభూయిష్ఠంగా విడిపోయివున్నది. ధనంకోసమో, పదవికోసమో, వ్యక్తిగత ప్రయోజనంకోసమో, దేశాన్ని శత్రువుకు అమ్మివేసే ద్రోహులుగూడ దేశంలో వున్నారు. మన పరమశత్రువులయెడ విధేయతను బహిరంగంగా ప్రకటించిన సంఘటిత రాజకీయపక్షాలు సహితం దేశంలో వున్నాయి. వెయ్యిసంవత్సరాలనుండి మనలను వెంబడిస్తున్న ఆత్మహత్యా సదృశమైన ఆత్మవిస్మృతిలోనే మనం నేటికీ మునిగివున్నాం.

భావనిర్మాణం ముఖ్యం

దురదృష్టవశాత్తూ, పరిపాలనాధికారం చేతుల్లోకివచ్చిన గత 17సంవత్సరాలలోనూ ఈ విషాదకర పరిస్థితిలో మార్పు రాలేదు. ఆర్థిక, రాజకీయ రంగాలలో మార్పులు తేవడానికై బ్రహ్మాండమైన ప్రణాళికలు రచింపబడ్డాయి. కాని జాతీయశక్తికి ఆధారభూతమైన ప్రజాహృదయాన్ని కదిలింపజేసేందుకు ఎట్టి ప్రయత్నమూ జరగలేదు. ప్రజలను స్వార్థచింతన, అల్పత్వములనెడి సుడిగుండాలనుండి బయట పడవేసి. జాతీయ జీవన ప్రవంతిలో లీనంచేయగల జాతీయ ఆత్మను మేల్కొల్పే యత్నం జరుగలేదు. హిందూరాష్ట్రీయతలోని వాస్తవికతను చూడకుండా కళ్లుమూసుకోవడంతో దేశంకోసం సర్వస్వాన్నీ త్యాగంచేయించి, ప్రతిరంగంలోనూ అత్యున్నత శిఖరాల నందుకొనచేయగల తేజఃపూర్ణమగు ఆదర్శమే కరువయింది. మన ప్రజలకు జాతీయజీవనంయొక్క ప్రాతిపదికలను బోధించి సుశిక్షితులను చేసే యత్నంగాని పథకంగాని ఎక్కడా కనుపించదు.

అందుచేత, విదేశీయులు దేశాన్ని వదలివెళ్లి 17 సంవత్సరాలు గడిచినా, మన జాతి రూపురేఖలు స్వచ్ఛమైన స్వతంత్ర కాంతులతో వెలుగొందడంలేదు. ప్రణాళికలు విఫలమవుతున్నాయి. ప్రతి రంగంలోను అవినీతి పెచ్చరిల్లిపోయింది. నిరాశా, నిస్పృహలు అందరి ముఖాలమీద తాండవిస్తున్నాయి. జాతియొక్క నాడి క్రమేపీ మందగిస్తోంది.

ప్రజలలో జాతీయ చైతన్యాన్ని రగుల్కొల్పి, సౌశీల్యాన్ని నిర్మించి. వారందరినీ ప్రచండశక్తిగా రూపొందించవలసిన ఆవశ్యకత నేటి పరిస్థితిలో ఎంతైనా వుంది. మిగతా అన్ని ప్రణాళికల విజయం ఈ జాతీయ పునరుజ్జీవనా పథకం యొక్క విజయంమీద ఆధారపడి వున్నది.

## ఎన్నో ఉదాహరణలు

ఇతర దేశచరిత్రలను పరిశీలిస్తే సంఘం ప్రకటించిన భావాలు సరియైనవని విశదమవుతుంది.

ఇంగ్లండు రెండు ప్రపంచయుద్ధాల బాధలను చిరునవ్వుతో భరించింది. సంపూర్ణ వినాశనం కలిగించే మహా విపత్కర సమయాలలోగూడ ధైర్యంతో నిలిచి పోరాడింది. దేశద్రోహులను ఇంగ్లండు ఎన్నడూ ఎరుగదు. కమ్యూనిస్టులకు ఆదేశంలో నిలుచుండే స్థానంగూడ లేదు. దేశం సంపదలతో తులతూగినా, కష్టాలలో మునిగినా, శాంతి సమయంలోనూ, యుద్ధసమయంలోనూగూడా, జీవితంలోని ప్రతిరంగంలోనూ వారి శీలానికి గీటురాయి జాతి శ్రేయస్సే సర్వప్రధానం అనేది. నాశనమెరుగని ఆంగ్ల జాతియొక్క జీవశక్తిలోని రహస్యమిదే.

యూదు ప్రజల ఉదాహరణగూడ ఇలాగే ఉత్తేజకరమైనది. ఎన్నడో రెండువేల సంవత్సరాల క్రిందట విదేశ దండయాత్ర కారణాన మాతృభూమి పరాధీనంకాగా, యూదులు ఆనాటినుంచీ దేశదేశాల్లో తలదాచుకున్నారు. వాళ్ళు వర్ణించనలవికాని అవమానాలకూ అన్యాయాలకూ గురి అయినారు. జర్మనీలో హిట్లర్ పరిపాలనలో 60 లక్షల యూదులు ఘోరంగా హత్యచేయబడ్డారు అరబ్బులు ఇజ్రాయిల్ భూభాగాన్ని శతాబ్దాల తరబడి తమ గుప్పెట్లో ఉంచుకొని స్వంతం చేసుకున్నారు. ఇట్టి దుర్భర పరిస్థితుల్లో కొద్ది లక్షలమంది యూదులు తమ మాతృభూమియగు ఇజ్రాయిల్ దేశాన్ని పునరాక్రమించుకొని స్వీయరాజ్యాన్ని స్థాపించుకున్నారు. రెండువేల సంవత్సరాల స్వప్నాన్ని వాస్తవం చేసుకున్నారు. 18 సంవత్సరాల స్వతంత్రకాలంలో ఇజ్రాయిల్‌ను శక్తిమంతమైన జాతిగా రూపొందించుకొన్నారు.

ఈ విచిత్రం ఎలా జరిగింది? కొలదిమంది యూదులకు తమదేశం యెడ, పరంపరయెడగల సాటిలేని భక్తిప్రపత్తుల కారణంగా రెండువేల సంవత్సరాల క్రితం మట్టి అయిపోయిన యూదుజాతి మరల ఊపిరి తీసుకొంది. ఆ సుదీర్ఘమైన కాలంలో ఇజ్రాయిల్‌యొక్క వైభవోపేతమైన స్ఫురణలు తమ హృదయాంతరాళాలనుండి చెరిగిపోకుండా భద్రపరచుకున్నారు. ఈనాటికీ ఇజ్రాయిల్‌లోని ప్రతి బాలబాలికా పరాక్రమోపేతులై ఆ చిన్నదేశముయొక్క స్వాతంత్ర్యానికి పరిరక్షకులుగా నిలిచివుంటారు.

ప్రపంచ గగనవీధిలో తళుక్కున మెరసిన జపాను శక్తిమంతమైన నవీనరాజ్యంగా రూపొందడానికి కారణం జపాను ప్రజల అమరము, అచంచలమగు ఆత్మశక్తియే.

ఇంకా ఎన్నో ఉదాహరణలను పేర్కొనవలసిన అవసరంలేదు. ఎట్టి ఋజువులతో నిమిత్తంలేకుండా సత్యం కళ్ళముందు కనుపిస్తూనే వున్నది. దేశ స్వాతంత్ర్యానికీ, అభ్యున్నతికీ జాతీయశీలం ఆధారం. తమ రక్తంలో జాతీయశీలం జీర్ణించివుండి, నిరంతర జాగురూకులైన పురుషకార సంపన్నులగు ప్రజలే- బాహ్య, ఆంతరికశత్రువులను సమర్ధమంతంగా ఎదుర్కొనగలరు; విచ్ఛిన్నకారులను ఛిన్నాభిన్నం చేయగలరు; ప్రపంచ రాజ్యాలలో తల ఎత్తుకొని నిలువగలరు.

ఈ పరిస్థితులను దృష్టిలోవుంచుకొని ఆలోచించినట్లయితే రాష్ట్రీయ స్వయంసేవక సంఘ కార్యముయొక్క ప్రాధాన్యము తేటతెల్లము కాగలదు.

## జాతీయ పునర్నిర్మాణ ప్రాతిపదిక

అయితే జాతీయ పునర్నిర్మాణానికి సంఘముయొక్క పథకము ఏమిటి? దాని ప్రాతిపదిక ఏమిటి? అనే ప్రశ్నలు ఉదయిస్తాయి.

ప్రపంచంయొక్క తుఫానులకు, భూకంపాలకు చెక్కుచెదరకుండా అచంచలంగా నిలచి ఉండాలంటే మన జాతీయ పునర్నిర్మాణసౌధముయొక్క

పునాది తగినంత లోతుగాను, దృఢంగాను ఉండాలి. ఎవరియెడనో ద్వేషముతో, సత్యము నిత్యమునైన జాతీయసంఘటన నిర్మింపబడజాలదు. ప్రతిక్రియాత్మక భావన లేదా విద్వేషము అనునవి ఒక సమాజమునకు శాశ్వతంగా బలము నివ్వలేవు అందుచేత మన జాతీయజీవనంయొక్క శాశ్వత మూల్యముల నాధారముచేసుకొని సంఘము రాష్ట్రనిర్మాణము చేయ దలచింది.

## మన జాతి జీవన సూత్రా లేవి ?

ఒకటి : యుగయుగాలనుండి పవిత్ర మాతృభూమిగాను, పుణ్యభూమిగాను, కర్మభూమిగాను, ధర్మభూమిగాను మనం ప్రేమించి సేవిస్తున్న ఈ భారతదేశంయెడల జాజ్వల్యమానమగు భక్తిప్రపత్తులు.

రెండు : మనమంతా ఆ మాతృదేవి సంతానమనే అవగాహనవల్ల మనలోకలిగే సహోదరభావము.

మూడు : ఒకే సంస్కృతి, పరంపర, చరిత్ర, సభ్యత, ఆశయాలు, ఆకాంక్షలు, ప్రాతిపదికగా ఏర్పడిన జాతీయ జీవనంతో తాదాత్మ్యం.

సంఘతత్వ సౌధానికి పునాదిశిల లీ మూడు అంశాలు.

ఈ విశుద్ధభావనా పరంపరను ఈ గడ్డపై జన్మించిన ప్రతి బిడ్డకు అందించి యావన్మందిని అనుశాసనాబద్ధము, అజేయమునైన జాతీయ శక్తిగా రూపొందించాలని సంఘం కృషిచేస్తోంది.

## సంఘం రాజకీయసంస్థకాదు

అందుచేత సంఘములో హైందవేతరులను ద్వేషించుటలాంటి వ్యతిరేకాత్మక భావాలకు ఏమాత్రమూ తావులేదు. మన దుస్థితికీ పతనానికీ మనమే బాధ్యులముగనుక మనలను మనం సంస్కరించుకోవడంద్వారా అభ్యున్నతి సాధించాలని సంఘం కోరుతోంది.

దైనందిన రాజకీయ కార్యకలాపాలకు సంఘం పూర్తిగా దూరంగా ఉంటుంది గనుక సంఘములో రాజకీయ ద్వేష వైషమ్యాలకు స్థానంలేదు. ఎన్నికలద్వారాగాని, రాజకీయ ప్రచారంద్వారాగాని, జాతీయ సమైక్యత సాధించవచ్చునని సంఘం విశ్వసింపదు. చట్టములద్వారా ప్రజలలో దేశ భక్తి, శ్రద్ధ, సౌశీల్యము, కలుపుగోలుతనము, త్యాగభావనలను ప్రజలలో రగుల్గొల్పగలమని సంఘము విశ్వసింపదు. అందుచేత ప్రజలను సంస్కరించి సంఘటితపరిచే ప్రధానకార్యాన్ని చేపట్టింది; నిజమైన ప్రజాశక్తిని సమీకరింపదలచింది; తాత్కాలిక ఉపశాంతికోసంగాక, సమాజానికి శాశ్వతమైన ఆరోగ్యం చేకూర్చాలని ఉద్దేశించింది; రాజకీయాధికారాన్ని చేపట్ట నిరాకరించింది. నిజమునకు జాతీయ జీవనంలోని అన్నిరంగాలలోను – రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, ధార్మిక, వైజ్ఞానిక, సాంకేతిక, సైనికరంగాలన్నింటిని–శాశనంచేసి, ఉత్తేజపరచాలని సంఘం వాంఛిస్తుంది. ప్రజలలో మన మాతృభూమియెడల అచంచల విధేయత, ప్రేమాభిమానాలను కల్గించి కార్యదీక్షను పెంపొందించుటద్వారా ఈ కార్యాన్ని సాధించాలని సంఘం యత్నిస్తోంది.

## సంఘటన అనగా వ్యక్తిత్వ నిర్మాణం

సంఘం నిర్మింపదలచిన శాశ్వతమూల్యములేవో మనం తెలుసుకున్నాం. తన ఆశయాన్ని సాధించడానికి ఏమార్గాలను అనుసరిస్తున్నదో పరిశీలిద్దాం. జాతియొక్క అనారోగ్యానికి రాజౌషధాన్ని కనిపెట్టిన డాక్టర్‌జీ ఆమందును ఇవ్వడంలోగూడ అతి సుళువైన పద్ధతిని మనముందుంచారు.

జాతీయ సంఘటనాకార్య మనగా జాతీయ సౌశీల్యమును, సమైక్యతను పోషించు గుణగణములను ప్రజలలో నిర్మించుట. మాతృభూమి ఎడ తీవ్రమైన ప్రేమాభిమానము, తోటి భారతీయుల ఎడ సహోదర భావము, జాతీయ కార్యములో బాధ్యత వహించు స్వభావము., జాతీయ

ఆదర్శముల ఎడ గౌరవ ప్రపత్తులు, క్రమశిక్షణాయుత జీవనము, శౌర్యము, పురుషకారము, మొదలైన ఉదాత్త లక్షణాలను ప్రజలలో నిర్మించాలని సంఘం కృషిచేస్తోంది. మనస్సులను ప్రభావితం చేసి శీలాన్ని రూపొందించే పని ప్రచారంవలనా, ఉపన్యాసాలవలనా, ప్రమాణాలు చేయించడం వలనా జరిగేది కాదు. దేశభక్తి అనేది నిరంతరము ఏండ్ల తరబడి హృదయంలో వెలుగొందవలసిన జ్వాల. అందుచేత దేశముయెడ శ్రద్ధాభక్తులు పెంపొందడానికి అనువైన వాతావరణంలో ప్రజలు ప్రతిదినమూ క్రమ పద్ధతిలో సమావేశ మవుతూ వుండాలి. "సంఘశాఖ" ఇందుకు ఆచరణ యోగ్యమైన మార్గము.

## సంఘ శాఖ సంఘటనా నిర్మాణ కేంద్రం

సంఘ శాఖ అంటే ఏమిటి? దాని కార్యక్రమ మేమిటి? దాని పద్ధతులు, ఆచారాలు ఏమిటి? ఈ పుస్తక ప్రారంభంలో ఇవ్వబడిన వర్ణన బయటనుండి చూస్తే శాఖయొక్క రూపాన్ని తెలుపుతుంది.

ప్రజలలో అన్ని తరగతులవారూ అచట గూడుతారు. భాష, ప్రాంత, వర్ణ, వర్గ, పక్ష తారతమ్యాలను విస్మరించి అచట యావన్మంది ఒకే మాతృభూమియొక్క పుత్రుల మనే భావనతో సమావేశమై, ఆ భూమి యొక్క పవిత్ర ధూళిలో ఆటలాడుతారు. గాఢమైన భక్తితో మాతృభూమి కొరకై ప్రార్థిస్తారు. ఆమె వైభవముకొరకై తమ జీవితాలను సమర్పించడానికి నిశ్చయం ప్రకటిస్తారు. తామంతా ఒకే మాతృభూమియొక్క బిడ్డల మను భావన దానంతటది వారిలో ఉత్పన్నమవుతుంది. అందరూ కలసి ఆడుతూ పాడుతూ వుండటంవలన ఏకత్వభావన వారిని ఒకటిగా జేస్తుంది. వారంతా పదం కలిపి నడుస్తూ, కలిసి మెలసి వ్యవహరిస్తుంటే వారి హృదయాలు ఒకేవిధంగా స్పందిస్తాయి.

ఈ కార్యక్రమం ప్రతిదినము నియమితకాలంలో ఒక గంట అత్యంత క్రమబద్ధంగా నిర్వహించబడుతుంది. వారంతా నాయకుని విధేయతతో అనుసరిస్తారు. వారి మనస్సూ, శరీరమూ ఒకే ఆనతిని అనుసరించడానికి అలవాటుపడతాయి; క్రమశిక్షణ వారి రక్తంలో ప్రవేశిస్తుంది. శారీరక శిక్షణకన్న ముఖ్యమైనది మనోనిగ్రహం.వారి వ్యక్తిగత ఉద్రేకాలు. ఉద్వేగాలు జాతీయ మహాకార్యసాధనానుగుణ్యంగా వినియోగించడం వాళ్లు నేర్చుకుంటారు.

కార్యక్రమంకంటె ప్రధానమైనది వాతావరణం మాధుర్యము, మనోవికాసము అక్కడ తాండవిస్తుంటాయి. అచట సమావేశమయే వివిధము, విభిన్నము నైన వ్యక్తిత్వాలనుండి కాలక్రమంలో ఒక అద్భుత సమైక్యత నిర్మాణమవుతుంది. ఘర్షణకు బదులుగా పొందిక ఏర్పడటం మనం చూస్తాము. సాంఘిక, రాజకీయ. ఆర్థిక, విబేధాల కతీతంగా - స్ఫూర్తివంతమగు జాతీయసమైక్యతాస్వప్నం సజీవంగా సాక్షాత్కరిస్తుంది.

ఈ జాతి పునర్నిర్మాణ కార్యక్రమం మన సమాజ, అమరత్వానికి ప్రతీకము, స్ఫూర్తిదాయకమునగు భగవాద్ధ్వజచ్ఛాయలలో నిత్యమూ జరుగుతూ వుంటుంది. అందలి ప్రతి పోగూ మన వైభవోపేతమైన గత చరిత్రలోని త్యాగధనులు. తపోధనులు, అనుపమ పరాక్రమోపేతులునైన దేశభక్తుల శౌర్యగాథల పవిత్ర స్మృతులను మనస్సులలో వెలుగొందజేస్తుంది. ఆ ధ్వజముయొక్క పునీత ఛాయలలో అనుదినమూ సమావేశమవడంద్వారా ఎల్లప్పమహత్తర సందేశాన్నీ, ఉత్తేజాన్నీ పొందడం సహజం. మాతృసేవలో తమ సర్వస్వాన్ని అర్పణచేయాలనే దృఢ నిశ్చయంతో వారుత్తేజితు లవుతారు.

శాఖ వ్యక్తులలో దాగియున్న దేశసేవా దీక్షను మేల్కొల్పుతుంది నాశనమెరుగని ప్రేమబంధాలతో వారిని అనుబంధిస్తుంది; స్వప్రేరణతో గూడిన అనుశాసనబద్ధమైన నడవడిని అలవరుస్తుంది. ఆవిధంగా

స్వచ్ఛమైన జాతీయ శీలానికీ శాశ్వతమైన జాతి సమైక్యతకూ శాఖ అనేది నిర్మాణ కేంద్రం అవుతున్నది.

## స్వయంసేవకుడు

నిస్వార్థ సేవాభావంతోను త్యాగభావంతోను సంఘ కార్యకలాపాలలో పాల్గొనేవారిని స్వయంసేవకులని అంటారు. స్వయంసేవకుడనగా కేవలం ఉత్సవాలసమయాల్లో గణవేషము ధరించి శారీరిక ప్రదర్శనలలో పాల్గొని అటు నిటు తిరుగు వాలంటీరువంటివాడుకాడు 'తాను ఆలోచించడు; తానుగా ఏదీ చేయడు; ఎవరేమిచెప్పినా జోహుకుం అంటూ చేస్తుంటాడు; జీతం బత్తెం పుచ్చుకొనడు'—ఇటువంటి వ్యక్తి స్వయంసేవకుడా? ఎంతమాత్రం కాదు. స్వయంసేవకుడనగా రాష్ట్రీయతను సాక్షాత్కరించుకున్న ధ్యేయవాది. వేయేండ్లుగా వికావికలైపోయిన జాతిని సంఘటితపరచాలనే బృహత్కార్యక్రమాన్ని ముందుంచుకొని దాన్ని సాధించడమను చరిత్రాత్మక బాధ్యతను స్వీకరించినవాడు స్వయంసేవకుడు. తన ఉద్వేగాలను, ఆకాంక్షలను, స్వభావాన్ని, ఒకమార్గంలోకి మలుచుకొని తాను జాతీయ పునర్నిర్మాణ కార్యంలో ఒక ఉపకరణంగా రూపొందాలని అతడు యత్నిస్తాడు. జాతీయ సేవాకార్యంలో నిమగ్నుడైనపుడు స్వప్రయోజనాలను, అధికార వ్యామోహమును, కీర్తికండూతిని తన మనస్సునుండి తుడిచివేస్తాడు.

అట్టి ఆదర్శశీలురను చూస్తుంటే ప్రజలు తాముగూడ జాతిక్షేమము కొరకై ఎట్టి కష్టాలనైనా పడడానికి, ఎట్టి త్యాగమైనా చేయడానికీ తామూ ఉత్సాహపడుతారు. కలిమిలేముల్లోను, కష్టసుఖాలలోను ప్రజలు తమంతట తాము అట్టివారి అడుగుజాడలలో నడవాలని ఉత్సాహపడుతారు. ఇలా యావత్తుజాతిలో నిద్రాణమైఉన్న శక్తిసామర్థ్యాలు ఉద్బుద్ధమై జాతీయ పునర్నిర్మాణ కార్యంలో వినియోగపడుతాయి. పునరుజ్జీవితము, పునర్నిర్మితమునైన జాతీయ జీవనమును గురించి కనిన కలలు నిజమవుతాయి. ఆ దివ్యస్వప్నం వాస్తవం అయిననాడు సంఘము తన ప్రత్యేకమగు నామ

రూపములను నిలుపుకొనవలసిన అవసరముండదు. సంఘము సమాజములో లీనమవుతుంది. అట్టి దృశ్యమును సాక్షాత్కరించుకొనుటకు స్వయంసేవకుడు సజీవ ఉపకరణం.

## హృదయముల సమాగమము

ఒక గంట శాఖా కార్యకలాపములలో వ్యక్తి నిర్మాణం ఎలా జరుగుతున్నదో, అచట ఎట్టి వ్యక్తిత్వము గల మనుష్యులు – స్వయంసేవకులు రూపొందించబడుచున్నారో తెలుసుకున్నాము.

ఈ గంట మాత్రమేగాక, మిగతా సమయాలలో గూడ స్వయంసేవకులు కలుసుకొంటూ వుంటారు. సమాజములోని ఇతర సోదరులను కలుసుకొని వారి సుఖ దుఃఖములను పంచుకుంటారు. జాతీయ సమస్యలను గురించి వారితో చర్చిస్తారు. అధికులు, అల్పులు అనే తేడా లేకుండా, నగరాలలోను కుగ్రామాలలోను ఉన్న ప్రజలందరిని కలిసి ఎంతో ఓపికతో, వారికి జాతీయ వ్యవహారములను గురించి నచ్చచెప్పుతూ వారి హృదయతంత్రులను మీటుతుంటారు.

స్వయంసేవకులు తాలూకాలవారీ, జిల్లాలవారిగా కల్సుకుంటుంటారు. ప్రాంత స్థాయిలోను, యావద్భారత స్థాయిలోకూడా కలుసుకుంటుంటారు. ఆ వారి స్థాయిలనుబట్టి వేర్వేరు శిక్షణ శిబిరాలు జరుగుతాయి. జాతీయ సమైక్యతా సాక్షాత్కారానికి ఇవి ఆచరణమార్గాలు. జాతీయభావన యనెడి జ్యోతిని వెలిగించి, వ్యక్తి నిర్మాణదక్షమైన సంఘ కార్యక్రమ సందేశాన్ని ఈవిధంగా ముందుకు తీసుకుపోతారు.

## దేశ వ్యాప్తంగా మేల్కొలుపు

ఇంతేగాక సంఘము జనసామాన్యాన్ని మేల్కొల్పడానికి సాధన తుల్యములగు జాతీయ పర్వదినముల నిర్వహించే సంప్రదాయాన్ని ప్రారంభించింది.

హిందూ సంవత్సరాది యగు ఉగాది పండుగ మన యుగకర్తలను, వారు సాధించిన ఘనవిజయాలను గుర్తుచేస్తుంది. ఉగాదినాడే సంఘ స్థాపకులైన డాక్టర్ హెడగెవార్ జన్మించారు. జ్యేష్ఠ శుద్ధ త్రయోదశినాడు జరుగు హిందూ సామ్రాజ్య దినోత్సవం ఛత్రపతి శివాజీ 1674 లో సాధించిన సర్వస్వతంత్ర హిందూ రాజ్యాన్ని గుర్తుచేస్తుంది. ఎనిమిది వందల సంవత్సరాల ముస్లిం పరిపాలనను వదలించుకొని ఆనాడు హిందువులు శివాజీ నాయకత్వాన స్వేచ్ఛాజీవితాన్ని పొందారు. ఆషాఢ పూర్ణిమనాడు గురుపూజోత్సవం. గురువునకు శిష్యుడు తన భక్తి గౌరవాలను వెల్లడిచేసే సంప్రదాయిక పర్వదినమది. సంఘం ఈ ఉత్స వానికి జాతీయరూప మిచ్చింది. మన ధర్మానికి, జాతీయతకు చిహ్నమైన భగవద్ధ్వజాన్ని సంఘం తన గురువుగా ఆరాధిస్తుంది. ఆనాడు స్వయం సేవకులు ధ్వజాన్ని పూజిస్తారు. శ్రావణపూర్ణిమనాడు రక్షాబంధనోత్సవం మనమంతా ఒకే మాతృభూమియొక్క సంతానమని గుర్తుచేస్తుంది. ఆనాడు సహోదరత్వానికి చిహ్నమైన "రక్ష" ను మిత్రుల చేతులకు కట్టుతాము. ఆశ్వయుజ శుద్ధ దశమినాడు విజయదశమీ మహోత్సవం దుష్టశక్తులపై మనజాతి సాధించిన విజయపరంపరను జ్ఞప్తికి తెస్తుంది. అది స్వయం సేవక సంఘంయొక్క జన్మదినంగూడాను. ప్రకృతిలో అంధకారమునుండి వెలుగునకు మార్పును సూచించే మకరసంక్రమణోత్సవం- సంక్రాంతి- స్వార్థపరతయనెడు చీకటినుండి జాతీయభావన యను వెలుగునకు పయ నించవలసినదిగా మనకు సందేశమిస్తుంది.

ఈ ఆరు జాతీయ ఉత్సవాలేగాక, జాతిని మేల్కొల్పి కర్తవ్యబోధ చేయుటకొరకై జనబాహుళ్యమును కదల్చివేయు రీతిలో అనేక భారీ కార్యక్రమములు నిర్వహింపబడుతుంటాయి.

దేశములో ఏ భాగములోని ప్రజలకు సుఖ దుఃఖములు తటస్థించినా యావద్భారతంలోవి ప్రజలు అవి తమవిగా భావించి ఆదుకొనుటకు

ముందుకు రావడం, వారి హృదయములు సానుభూతితో స్పందించడం- ఇది జాతి జాగృతమైనదని అనడానికి ప్రధాన లక్షణం.

దేశవిభజన అనంతరం పశ్చిమ పంజాబు, తూర్పుబెంగాలు మొదలైన ప్రదేశాలనుండి మన సోదరీ సోదరులు యమయాతనలనుభవించి ఇచటకు రాగా స్వయంసేవకులు వారికి కలిగిన కష్టాలను, వారుపొందిన అవమానాలను దేశప్రజలందరికి వివరించిచెప్పారు. వారిసహాయార్థం ఇంటింటికి వెళ్ళి వస్త్రములు, ధనము వసూలుచేసి శరణార్థి సహాయశిబిరాలను నిర్వహించారు. జాతికి వచ్చే ప్రతి విపత్తూ దేశంలో ఎక్కడున్న స్వయంసేవకులనైనాసరే కదలించివేస్తుంది. తగువిధంగా కార్యరంగంలోకి దుమికి పనిచేయడానికి ప్రతి స్వయంసేవకుడూ తనంతటతాను ముందుకువస్తాడు.

జాతీయ సమ్మాన చిహ్నముల ఎడ గౌరవ ప్రపత్తులను ప్రకటించడం జనులను మేల్కొల్పుటలో మరొక అంశం. గోవు మన సమాజానికి అట్టి ఒక సమ్మాన చిహ్నము. విదేశీ పరిపాలనాకాలంలో జాతిని అవమానపరచడానికి ప్రారంభమైన గోహత్య దేశంలో అరికట్టబడాలని ప్రజలు చిరకాలంనుండి ఆందోళన చేస్తున్నారు. ఆ చిరవాంఛితాన్ని మరల ప్రభుత్వ దృష్టికి తేవడంకోసం స్వయంసేవకులు పెద్ద ఎత్తున ప్రజాభిప్రాయాన్ని ప్రకటించారు. నాలుగువారాల వ్యవధిలో గోహత్య నిషేధించబడాలని కోరే విజ్ఞప్తి పత్రాల మీద దేశవ్యాప్తంగా రెండుకోట్ల వయోజనులనుండి సంతకాలు సేకరించి ప్రభుత్వానికి సమర్పించారు. ప్రపంచంలో సంతకాల సేకరణలో అగ్రస్థానం పొందిన ఉద్యమ మిది.

ఇలా ఒక ప్రక్క దైనందిన శాఖా కార్యక్రమాల ద్వారా జాతీయ భావన, సౌశీల్య నిర్మాణము సమైక్యత ప్రజలలో ఏర్పరచబడుచున్నాయి మరొకవైపున వివిధ సామూహిక ఉద్యమాల ద్వారా జాతీయత అనెడి అగ్నిజ్వాల పరిపుష్టమొనర్చబడుతోంది ఈ పవిత్ర జ్వాల సుమార

ప్రదేశాలకు గూడ విస్తరించి కల్మషముల నన్నింటిని దహించివేస్తూ, మన జాతీయ జీవనానికి నూతన కాంతులను చేకూరుస్తోంది.

## డాక్టర్ జీ అమరులైనారు

డాక్టర్ జీ నాగపూర్‌లో కొలదిమంది మిత్రులతో మొట్టమొదటి శాఖను స్థాపించారు. పవిత్రజీవనము, శ్రద్ధాయుతమైన సేవ. అపరిమిత సామర్థ్యము, తాము రూపొందించిన కార్యవిధాన విజయమునందు అచంచల విశ్వాసము– ఇవే వారి మహాయత్నమునకు మూలధనము. చిల్లిగవ్వ లేకుండా ప్రారంభమైంది సంఘం. ఐతే వారి అచంచలమైన దీక్షను ఏ కష్టమూ కదల్చలేకపోయింది; వారి అమితమైన ప్రశాంతతను ఎవరూ భగ్నపరచలేకపోయారు.

డాక్టర్ జీ యొక్క మిత్రులు గూడ వారి ఆదర్శవాదానికి ప్రభావితులైనారు. వారి మహత్తర ఆకాంక్షలను, కార్యక్రమాన్ని తనలోనే ఇముడ్చుకొనదగినంత వైశాల్యము ఏఒక్క నగరానికి, ఏఒక్క ప్రాంతానికి లేదు. వారు క్రొత్త క్రొత్త ప్రాంతాలకు తమ జైత్రయాత్రను సాగించారు. సుదూర ప్రదేశాలలో శాఖలు ప్రారంభించారు. ప్రతిచోటా అదే శాఖ, జాతీయ సమైక్యతాభావవ్యాపక మగు అదే వాతావరణం. వారి ఎదుట భాష, ప్రాంతము, ఆహార విహారములకు సంబంధించిన పైపై విభేదాలన్నీ మటుమాయమైనాయి. జాతీయ పునరుజ్జీవన కార్యక్రమం అంచెలంచెలుగా బలపడ నారంభించింది.

1940 మే నెలలో దేశములోని అన్ని ప్రాంతాలనుండి స్వయంసేవకులు నాగపూరులో శిక్షణతరగతులకు సమావేశమైనారు. అప్పుడచట డాక్టర్ జీ తాము కలగన్న పునర్నిర్మిత హిందురాష్ట్ర సంక్షిప్త స్వరూపాన్ని దర్శించారు. వారితో డాక్టర్ జీ కొద్ది మాటలే మాట్లాడారు

ఐతే విధివశాత్తూ అదే వారి అంతిమ సందేశమైనది. 1940 జూన్ 21న డాక్టర్‌జీ కన్నుమూశారు.

15 సంవత్సరాలపాటు విశ్రాంతి విరామం లేకుండా సంఘము యొక్క విస్తరణకై డాక్టర్‌జీ కృషిచేశారు. తుట్టతుదకు వారి ఉక్కువంటి శరీరం గూడ వారి అపరిమిత ఆవేదనా తీవ్రతకు, చైతన్యపు ధాటికి తట్టుకో లేకపోయింది.

వారు తమ జీవితాన్నే ఒక జ్యోతిని చేశారు. ఆఖరి రక్తబిందువు వరకు ఆ జ్యోతి వెలుగుతూనే ఉంది. ఆ అసంఖ్యాక జనజీవన సంస్కర్త, అధినేత ఆకస్మికంగా అస్తమించారు. ఇంకా శైశవంవీడని సంఘానికి విధి ఎంతటి క్రూరమైన దెబ్బకొట్టింది.

వారి మరణంతో సంఘము యొక్క జీవశక్తి నిష్క్రమించిందని కొందరు అనుకున్నారు. సంఘ భవిష్యత్తును గూర్చి చాలామంది ఆందోళనను వెలిబుచ్చారు. ఐతే వారందరి భయములు నిరాధారములని బుజువయాయి. సంఘము మరింత వేగంతో పురోగమించ నారంభించింది. డాక్టర్‌జీ తన అనుచరుల హృదయాలలో సృష్టించింది కేవలం తనయెడ ౹భిమాన విధేయతలు కాదు. వాళ్ళ విధేయత ఆదర్శం ఎడలనే.

డాక్టర్‌జీ భౌతికకాయం అదృశ్యమైన తర్వాత, సేవాత్యాగపూర్ణ జీవనాదర్శం సంఘ సంప్రదాయమైంది. ఆవిధంగా డాక్టర్‌జీ అదృశ్యులుగా సంఘానికి స్ఫూర్తి నిస్తూ అమరులై నిలచియున్నారు.

## నూతన నాయకత్వం

ఈ లోకమును విడనాడకముందు డాక్టర్‌జీ సంఘానికి నూతన మార్గదర్శిని నియమించారు. తన అనంతరం ఎవరీ కార్యభారాన్ని వహించ గలరాఅను విషయాన్ని వారు చాలా సంవత్సరాలనుంచి ఆలోచిస్తూవచ్చారు.

తన అపరిమితమైన ప్రేమతోను, వివేకముతోను నూతన నాయకునికి తగు మార్గంలో శిక్షణ నిస్తూ వచ్చారు. మరణానికి పూర్వదినం తనకు సెలవు కానున్నదని గుర్తించి సన్నిహిత కార్యకర్తలను చేరబిలిచి, తన అనంతరం తన బాధ్యతను స్వీకరింపవలసిన వ్యక్తిని సూచించారు. మరణశయ్యపై పరుండి గూడ సంఘానికి తాను చేయవలసిన ఆఖరు సేవను చేశారు. నూతన కర్ణధారి సంఘనౌకను క్షేమంగా గమ్యస్థానము చేర్చి తన ఆకాంక్షలకు రూప మివ్వగలరనే పరిపూర్ణ విశ్వాసంతో ఆయన కన్ను మూశారు. ఆ నూతన నాయకులు శ్రీ మాధవరావ్ సదాశివ గోళవల్కర్ - శ్రీ గురూజీ - ప్రస్తుత సరసంఘచాలక్.

శ్రీ గురూజీ తన తల్లిదండ్రులకు మిగిలిన ఏకైక పుత్రుడు. అంను చేత చాల గారాబంతో పెరిగారు. బాల్యంనుంచీ వారి అసాధారణ ప్రజ్ఞా విశేషములు కనబడ్డాయి. ఎం. ఎస్. సి పట్టముపొందిన తర్వాత కా హిందూ విశ్వవిద్యాలయంలో కొంతకాలం ప్రొఫెసరుగా పనిచేశారు. వా విద్యార్థులు ఆదరముతో వారిని గురూజీ అని పిలిచేవారు. అనంతరకాలంలో ఆ పేరే నిలిచిపోయింది. ఐతే ఏదో ఒక ఉద్యోగంలో బంధించివేయబడే తత్వం కాదు వారిది. ఉద్యోగానికి రాజీనామా యిచ్చి నాగపూరు వచ్చేశారు. ఎల్. ఎల్. బి చదివారు. కాని న్యాయవాదవృత్తి చేపట్టలేదు. అపుడు వా అత్యంత ఆకర్షవంతమగు డాక్టర్‌జీ ప్రభావంలోకి వచ్చారు. నరేంద్రుడు శ్రీరామకృష్ణుని సాంగత్యంలోనికి రావడంలాంటిది. ఫలితంగూడ అంతటి చారిత్రకమైనదే. డాక్టర్‌జీ పాదాల చెంత తన జీవితాన్ని ఉంచడానికి గురూజీ నిశ్చయించుకున్నారు. వ్యక్తిగత సౌఖ్యాలనుగాని, కుటుంబ విషయాలనుగాని వారు మనస్సులోనికి రానిచ్చేవారుకారు వారి తీవ్ర ఆదర్శ వాద మనెడి అగ్నిజ్వాలల ఎదుట లౌకికజీవితవాంఛలనెడి నీడలు అదృశ్య మైనాయి.

## జాతియొక్క మహానాయకుడు

ఈనాటివరకు జాతీయ పునరుజ్జీవన పథమును తేజోవంతముచేయు మహాజ్యోతివలె వారి జీవితం జ్వలిస్తూవున్నది. 1940 నుంచీ స్ఫూర్తివంతమైన వారి నాయకత్వాన సంఘం మహోద్ధతితో అభివృద్ధిచెందింది. శ్రీ గురూజీవలె అతి తరుచుగా యావద్భారతదేశాన్ని పర్యటిస్తున్న మహనీయులు అరుదుగావుంటారు. వారు సదా వేలకొలది ప్రదేశాలలో, లక్షలాది స్వయంసేవకులతోను, అన్యులతోను సన్నిహితసంబంధం కలిగి ఉంటారు.

జాతియొక్క నాడిని నిరంతరము పరిశీలిస్తూ దేశక్షేమం యెడల అవిరళశ్రద్ధగల శ్రీ గురూజీ జాతిని నడిపించడానికి సర్వసమర్థులైన నాయకులు. పదవిమీద, అధికారముమీద, వ్యక్తిగత కీర్తిమీద ఆసక్తులను అధిగమించి జాతిశ్రేయస్సుమీదనే మనస్సును కేంద్రీకరించి వుంచుతారు. అందుచేత వారి పలుకులలో నిష్ఠుర సత్యాలు కానవస్తాయి. జాతీయ సమస్యలను నిర్భయంగా ప్రజలముందుంచుతారు; ఆ విషయంలో వ్యక్తులకుగాని, పార్టీలకుగాని ఎలాంటి మినహాయింపులూ యివ్వరు. దేశవిభజనకు పూర్వం రాజకీయనాయకులకు, ప్రజలకు వారు చేసిన హెచ్చరికలు దేశంలో ఒకమూలనుండి మరొకమూలకు ప్రతిధ్వనించాయి. కాశ్మీరు సమస్యను ఐక్యరాజ్యసమితికి భారతప్రభుత్వం నివేదించిననాడు శ్రీగురూజీ దీనివల్ల సమస్య పరిష్కారం కాకపోగా, దేశంయొక్క ప్రయోజనాలు తీవ్రంగా దెబ్బతింటాయని స్పష్టంగా హెచ్చరించారు. నాగా సమస్య తల ఎత్తినప్పటినుంచీ నాగా తిరుగుబాటుయొక్క నిజస్వభావాన్నిగూర్చి వారు దేశాన్ని హెచ్చరిస్తూ వున్నారు. చైనా దురాక్రమణగూర్చి మనప్రభుత్వం ప్రజలకు వార్తలు వెల్లడించడానికి కొన్ని ఏండ్ల పూర్వంనుంచీ శ్రీగురూజీ ప్రజలను, ప్రభుత్వాన్ని, చైనా ఉపద్రవాన్నిగూర్చి హెచ్చరిస్తూవున్నారు.

పండిత నెహ్రూ చౌ-ఎన్-లైలు దేశంలో పర్యటించి ప్రజలచే హిందీ చీనీ భాయ్ భాయ్ నినాదాలు ఇప్పిస్తుండగా, శ్రీ గురూజీ దేశమును యావత్తు శీఘ్రంగా పర్యటించి ఆ నినాదాలు యిచ్చే చైనాయొక్క నోట్లో వున్న రాక్షసదంతాలను ప్రజలకు ఎరుకపరచారు. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన చరిత్రాత్మకమైనదనీ, దేశసమైక్యతకూ,పురోభివృద్ధికీ దారితీస్తుందనీ ప్రతిఒక్కరూ హర్షిస్తున్నరోజుల్లో, శ్రీ గురూజీ ఒక్కరే అది భాషా సంబంధమైన పిడివాదాలకు, వైమనస్యాలకు దారితీయగలదని వైరాలకు దారితీస్తుందని ముక్తకంఠంతో హెచ్చరించారు ప్రతిసందర్భంలోను వారి హెచ్చరికలు సంపూర్ణసత్యములని ఋజువైనాయి. అంధకారబంధురంగా వున్న దేశపరిస్థితులపై వారు వెలుగును ప్రసరించారు.

శ్రీ గురూజీ కేవలం ముందు హెచ్చరికలుచేసి ఊరుకోవడంలేదు. జాతీయ విపత్కరపరిస్థితులలో వారు ముందుకువచ్చి ప్రజలకు స్వయం సేవకులకు మార్గనిర్దేశంచేసి నాయకత్వం వహించారు దేశవిభజన[illegible] పంజాబు అరాచకంతో అల్లకల్లోలమైపోయినప్పుడు శ్రీ గురూజీ ఆ దుర దృష్టకర సమయంలో హిందువులనడుమ ఏకైక ఆశారేఖగా నిలిచారు. వారి ఆదేశానుసారం స్వయంసేవకులు హిందూసోదరుల మాన ప్రాణ రక్షణకై ముందుకు దుమికి కృషిచేశారు. ఆ విషాదకరదినాలలో స్వయం సేవకులు ప్రదర్శించిన త్యాగనిరతి, అచంచలదీక్ష, ధైర్యస్థైర్యాలు మృతులకు సైతము జీవముపోయజాలినట్టివి. అటుతరువాత పాకిస్తాన్ కాశ్మీరుపై దాడిచేసినపుడు స్వయంసేవకుల సాటిలేని కార్యదీక్ష ధైర్య సాహసాలు, కాశ్మీరును రక్షించాయి. శ్రీనగర్ విమానాశ్రయం మంచుతో నిండిపోయి వుండగా, సంఘ స్వయంసేవకులు తమ సర్వశక్తిని వినియో గించి రాత్రి యావత్తు పనిచేసి విమానాశ్రయంలో మంచుగడ్డలను తొల గించి భారత విమానాలు మరునాటి ఉదయం దిగేటందుకు ఏర్పాటుచేశారు.

శ్రీ గురూజీ చైతన్యవంతమైన నేతృత్వం, ఇలా విపత్కరపరిస్థితులలో కొట్టుమిట్టాడుతున్న జాతీయనౌకకు ధృవతార అయింది.

1948లో మహాత్మాగాంధీ హత్యానంతరం ప్రభుత్వం సంఘాన్ని నిషేధించిన సమయంలో సమగ్రము, సమర్థవంతమునైన శ్రీ గురూజీ నాయకత్వానికి మరొక చక్కని తార్కాణం కనిపించింది. సంఘాన్ని నిషేధించడం అన్యాయం, అవివేకం అని తమకు స్పష్టంగా తెలిసినప్పటికీ వారు ప్రభుత్వ నాయకులతో మన్ననతో మాట్లాడి, న్యాయం చేకూర్చవలసిందిగా అర్థించారు. విపరీతముగా నొప్పింపబడినా, వారి ఆజ్ఞల కెదురు చూస్తూ ఎట్టి త్యాగాలకైనా సిద్ధంగావున్న లక్షలకొలది స్వయంసేవకులు తన వెనుక నున్నప్పటికీ, ఆయన అనంత నిగ్రహంతో వ్యవహరించారు. ఇంగ్లీషువారు వెళ్ళిపోయిన వెంటనే జాతిలో అంతర్గత విభేదాలు పొడసూపరాదనీ, అది శత్రువులకు మాత్రమే ప్రయోజనకారి అనీ భావించి వారు అవమానాన్ని ప్రశాంతంగాభరించి ఊరుకున్నారు. ఐతే ప్రభుత్వము వారి అభ్యర్థనను వినిపించుకోక, బలహీనతవల్ల సంఘం ఇలా మెత్తబడినదని అంచనావేసింది. ఏ ఇతరమార్గమూలేక శ్రీ గురూజీ స్వయం సేవకులను అనుదినశాఖా కార్యక్రమాలను పునఃప్రారంభించుకొననగునని సూచించారు. జాతీయజీవనంలో న్యాయము నిలబెట్టేటందుకై బాధలకూ త్యాగాలకూ సిద్ధంకావలసిందిగా అది హెచ్చరిక. క్రమశిక్షణలోనూ సంఖ్యలోను ఇదివరలో జరిగిన స్వాతంత్ర్యోద్యమాలన్నిటికంటె సంఘంపై నిషేధం రద్దుకై జరిగిన ఉద్యమం అగ్రస్థాయినందుకున్నది. ఆ తరువాత ప్రభుత్వం సంఘం మీద ఎట్టి షరతులు లేకుండా నిషేధాన్ని తొలగించింది. శ్రీ గురూజీ నాయకత్వపు ఘనవిజయ మిది. వారికి తమ గౌరవాభివాదములను తెలుపుటకు దేశమంతా లక్షలాదిమంది ఏకత్రితమైనారు. దేశవ్యాప్తంగా శ్రీ గురూజీ ఉపన్యాసాలకు తండోపతండాలుగా లక్షలాది భారతప్రజలు వచ్చి తమ ఆనందాన్ని వెల్లడించారు. ఆ విజయో

త్యవక్షణంలోగూడా శ్రీ గురూజీ ప్రభుత్వాన్ని పల్లెత్తుమాట అనకుండా జాతీయ సామరస్యమునే ఉద్ఘాటించారు: "ఏది ఏమైనా, ఈ ప్రభుత్వం మనది. ఏమరుపాటుగా నాలిక కొరుక్కుంటే పళ్ళను ఊడబెరకముగదా!" అని వారన్నారు.

అందువల్ల నేడు వారిని సంఘనాయకులుగా మాత్రమే గాక తమ నిజమైన నాయకునిగాకూడా జాతి గ్రహించజొచ్చింది.

## సంఘ మనెడి గంగాస్రవంతి

వారి స్ఫూర్తిదాయకమగు నాయకత్వంలో సంఘం నిరాటంకంగా ముందుకు పురోగమిస్తోంది. ఈనాడు సంఘం దేశంలోని ప్రతి మారు మూల ప్రాంతానికీ విస్తరిస్తోంది. లక్షలాది స్వయంసేవకులు అనుదినమూ హిమవత్పర్వత శ్రేణులు మొదలు కన్యాకుమారి తీరంవరకు వేలకొలది కేంద్రాలలో కలుసుకొంటూవున్నారు. దేశసమైక్యత, జాతీయ ఏకత్వములను నిలబెట్టడంకోసం వారు చేస్తున్న పోరాటం నిర్విరామంగా కొనసాగుతోంది. నగరవాసుని, వనవాసిని, కర్మాగారంలోని కార్మికుని, గ్రామం లోని కర్షకుని, ఇలా వీరు వారనిగాక యావన్మందినీ సంఘం తన ఒడిలోనికి తీసుకొంటున్నది. పై పైన కన్పించే రాజకీయ, సాంఘిక ప్రాంతీయ, భాషా విభేదాలను విస్మరించి యువకులు వృద్ధులు, పెద్దలు, చిన్నలు, సంఘమనే జాతీయ మహా ప్రవాహంలో పునీతులవుతున్నారు సంఘమనెడి గంగా స్రవంతి రోజు రోజుకూ విశాలము, వేగవంతముస్తై ప్రవహిస్తోంది.

## పెద్దల విశ్వాసం

మన జాతీయ జీవనాన్ని పునర్నిర్మించడానికి జరిగే ఈ బ్రహ్మాండ మైన కార్యం విజయం పొందడం ప్రతి దేశభక్తుని హృదయాన్ని

ఉప్పొంగజేస్తుంది. డాక్టర్‌జీ సజీవులుగా వున్నపుడు మహాత్మాగాంధీ, విఠల్‌భాయ్ పటేల్ లాంటి నాయకులు తమ స్వప్నములు సంఘంద్వారా వాస్తవములగుచున్నందుకు హర్షం వెలిబుచ్చారు.

1927 లో సుబాస్ చంద్రబోస్ డాక్టర్‌జీని కలుసుకున్నారు. చాలాసేపు సంభాషించిన పిదప, "డాక్టర్! జాతీయ పునరుజ్జీవనమునకు ఇదే సరియైన మార్గమని నాకు విశ్వాసం కల్గింది'' అని అన్నారు

1929లో మదనమోహన మాలవ్యా నాగపూర్ శాఖను దర్శించి తన్మయత్వం చెందారు. డాక్టర్‌జీతో కలిసి సంభాషించిన పిదప ఇలా ఆశ్చర్యం వెలిబుచ్చారు: "ధనముకంటె హృదయానికి ప్రాధాన్యమిచ్చు ఏ ఇతర సంస్థను నేను చూడలేదు''.

రాష్ట్రపతి రాధాకృష్ణన్ కాశీలో విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా వుండగా, సంఘశాఖను దర్శించి కార్యకర్తలను అభినందించారు.

1947 సెప్టెంబరు 17 న గాంధీజీ ఢిల్లీలో భంగీ కాలనీలోగల సంఘ శాఖకువచ్చి అచటి స్వయంసేవకుల నుద్దేశించి ఇలా అన్నారు: "మీ క్రమశిక్షణ, నిరాడంబరత, అస్పృశ్యతారాహిత్యం నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. సేవ స్వార్థ త్యాగములవంటి ఉన్నతాశయాలతో నడిచే ఏ సంస్థ అయినా వృద్ధిచెంది తీరుతుందని నాకు నమ్మకం కలిగింది.''

1947-48 లలో దేశం ఎదుర్కొన్న విపత్కర దినాలలో సంఘ స్వయంసేవకులు నిర్వహించిన పాత్రను ప్రశంసిస్తూ భారతరత్న డాక్టర్ భగవాన్‌దాస్ గారు ఇలా వ్రాశారు: "1947 సెప్టెంబరు 10వ తేదీన ముస్లింలీగువారు భారత కేంద్ర ప్రభుత్వంలోని యావన్మంది మంత్రులను, ఇతర హిందూ నాయకులను ఆకస్మికంగా హత్యచేసి ఢిల్లీని హస్తగతం చేసుకోవాలనే కుట్రను ఈ త్యాగధనులు, దేశభక్తి ప్రపూర్ణులగు యువకులు ముందుగా తెలుసుకొని సర్దార్ పటేల్ గారికి హెచ్చరించి వుండకపోతే

ఈనాడు దేశంలో భారత ప్రభుత్వమంటూ ఉండేదికాదు. దేశం యావత్తూ పాకిస్థానుగా మారిపోయేది.''

1948లో సర్దార్ పటేల్ స్వయంసేవకుల దేశభక్తిని శ్లాఘిస్తూ అభినందించారు.

కంచి కామకోటి, శృంగేరిపీఠాధిపతులగు జగద్గురు శంకరాచార్యులు, ఆచార్య తులసి, సాధు వాస్వానీ, స్వామి చిన్మయానంద లాంటి యోగి పుంగవులు తరుచుగా సంఘ శాఖలకు విచ్చేసి కార్యకర్తల నాశీర్వదిస్తూ వున్నారు.

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తులగు శ్రీ మెహర్‌చంద్ మహాజన్, స్వర్గీయ పతంజలిశాస్త్రిగారలు, విఖ్యాత చరిత్రకారులగు డాక్టర్ ఆర్. సి. ముజుందార్, డాక్టర్ రాధాకుముద ముఖర్జీ గారలు, ప్రముఖ దేశనాయకులగు స్వర్గీయులు శ్రీ టి. ఆర్. వెంకట్రామశాస్త్రి, డాక్టర్ శ్యామప్రసాద ముఖర్జీ, డాక్టర్ అంబేద్కర్, భారతరత్న అన్నా సాహెబ్ కార్వే, శ్రీ పురుషోత్తమదాస్ టాండన్, ఇపుడు మనముందున్న ప్రముఖ నాయకులు డాక్టర్ సి పి. రామస్వామి అయ్యర్, డాక్టర్ కె. ఎం. మున్షీ, డాక్టర్ కైలాసనాధకట్జూ, శ్రీ ఎన్. వి. గాడ్గిళ్, సర్దార్ స్వర్ణసింగ్, జనరల్ కరియప్ప, శ్రీ వి. పి. మీనన్, శ్రీమన్నాత్ పద్మనాభన్ గారలు సంఘ ఉత్సవాలకు అధ్యక్షత వహించియు, స్వయంసేవకులకు ఉపన్యసించియు తమ శుభాకాంక్షలను, సహకారాన్ని అందజేశారు.

స్వాతంత్ర్య సమర వీరయోధుడు వీరసావర్కార్ ''హిందూరాష్ట్ర సాధనలో సంఘ మొక్కటే ఆశారేఖ'' అని అన్నారు.

## మాతృదేవి ఆదేశం

క్లుప్తంలో రాష్ట్రీయ స్వయంసేవకసంఘ జనన వికాసములకధ ఇది.

గత నలుబది సంవత్సరాలలో జరిగిన సంఘకార్యాన్ని అందరూ పరిశీలించవచ్చు. సంఘంకొరకై తన సర్వస్వాన్నీ సమర్పించిన డాక్టర్‌జీ జీవితాన్ని ప్రజలు చూచారు. జ్వలిస్తున్న ఆదర్శవాదానికి ప్రతీకమైన

శ్రీ గురూజీ జీవితాన్ని ప్రజలు నేడు గమనిస్తూనేవున్నారు. తమ చెమట తోను, రక్తంతోను. అశ్రువులతోను దేశస్వరూపాన్ని మార్చివేయ సమకట్టిన వేలకొలది సంఘ కార్యకర్తలను ప్రజలు శ్రద్ధగా పరీక్షిస్తూనే వున్నారు. సంఘ ఆదర్శంయొక్క ఔన్నత్యాన్ని దేశాన్ని పీడిస్తున్న వ్యాధిని గుర్తించడంలో సంఘ నిర్ణయం సరియైనదనీ, ఆశయాన్ని సాధించడంలో సంఘ విధానం సమర్థవంతమైనదనీ ప్రజలీనాడు శ్రద్ధగా గమనిస్తున్నారు. దేశంలో ఎల్లెడల పరిస్థితులు విషమిస్తున్న ఈ సమయంలో జాతీయశక్తి ఇలా వృద్ధి చెందడంద్వారా ప్రజలలో నూతన విశ్వాసం, ఆశ ఏర్పడుతున్నాయి.

ఆత్మ సంస్కారముద్వారాను, ఆత్మ క్షాళనంద్వారాను మనజాతి మహావైభవోపేతమగు భవిష్యత్తును నిర్మించుకోగలదనే ఆకాంక్ష ప్రజల మనస్సులలో సహజంగా ఏర్పడుతోంది. ఒకానొకప్పుడు శ్రేష్ఠత్వానికి ఏహ్నంగా నిలబడి మానవాళికి మార్గదర్శకత్వం వహించిన హిందువుడు మరల ఆ స్థానాన్ని ఆక్రమించితీరుతాడు. గాఢనిశీధము గడచిపోతున్నది. గాఢసుషుప్తినుండి భారతమాత మేల్కాంచుచున్నది. ఒకమారు మేల్కొనపిదప, విశ్వంలో సాంస్కృతిక సింహాసనం అధిష్ఠించకుండా ఆమెను ఎవరూ ఆపజాలరు.

ఆమె పుత్రులమైన మనం లక్షలసంఖ్యలో సమావేశమవుదాం. పవిత్రమైన ఆమెయొక్క ధూళిలో ఆటలాడుదాం. మనహృదయాలనూ నాలనూ ఒకే రీతిలో కలిపిస్తూ నడుద్దాం. లక్షలకొలది కంఠాలనుండి ఏ కీర్తిని వినిపిద్దాం. లక్షలకొలది హృదయాలనుండి 'నమస్తే సదా త్సలే' అని ప్రార్థన వినిపిద్దాం.

ఆమె ప్రియపుత్రులమైన మనం ఆమె పిలుపు విని ముందుకు సాగుదాం. రోజుల తరబడి, సంవత్సరాల తరబడి కార్యరంగంలో దుమికి పనిచేద్దాం.

అవును! పునరుజ్జీవనము నొంది, పునరుద్ధారణ పొందిన భారత దేశం ప్రపంచమంతటా కాంతులను విరజిమ్మి మానవాళిచే మన్ననలను పొందు సుదినం వచ్చితీరగలదు.

